# ప్రాచీన వీరశైవము

కన్నడ మూలము :

వే॥ పం॥ చన్నబసవశాస్త్రి రాయచూరు గారు

తెలుఁగు సేత :

వే॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" సం॥ (కలకత్తా)
M. O. L. తే. (ఉస్మానియ యునివర్సిటి)

**వెల : 20-00**

ప్రకాశకుల చిరునామ :

ం. నెం. 3-3-139, కాచిగూడ, హైదరాబాదు-500 027. (A. P

ఆవిష్కరణము :

63, మంది పురాతను పూజల సందర్భమున
తేది 25 మే 1987 సోమవారం

---

గమనిక:- వీరారు చెల్లించిన గ్రంథమూల్యము మరో గ్రంథప్రచురణ తోడ్పడుతుంది.

# అక్షరాంజలి

సమర్పణ :- ఎం. శంకరయ్య M.A; M.O.L
తెలుగు పండితులు, ఇబ్రాహింపట్నం

శివశ్రీ పెద్దమఠము రాచవీరదేవరగారు లబ్ధప్రతిష్ఠులైన పండిత వర్యులు. సంస్కృతాంధ్రాలలో చక్కని వైదుష్యంగలవారు. కర్నాటక హిందీ ఆంగ్లములలో సముచిత పరిచయముగల సాహితీవేత్తలు. "పండితరత్న" "ధర్మనిరత" సాహిత్యవిశారదాది బిరుదాంకితులు, తెలుగులో విశారదులై హిందీ భూషణులై, కన్నడమున "జాణలై" యుండియు కలకత్తా నుండి సంస్కృతమున "కావ్యతీర్థ" పట్టమును, ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి "M.O.L" ప్రాచ్యభాషాపట్టమును చేపట్టిన విద్యాధికులు, వీరశైవ ధర్మతత్త్వ ప్రచారమునకై వీరశైవ ధర్మాన్వేషణము, బసవేశ్వరుని తత్త్వములు. మహాజ్ఞాని చన్నబసవన్న, రత్నత్రయము, ఇష్టలింగార్చనవిధి, మున్నగు గ్రంథరాజములను వెలయించిన ప్రసిద్ధరచయితలు. భాగ్యనగరము నందలి వివిధ పాఠశాలలో కళాశాలలోను సంస్కృతాంధ్ర భాషాబోధకులుగా నుండుచునే కష్టనష్టముల కోర్చి యొకదశాబ్దము పాటు "వీరశైవ ధర్మ" అను పత్రికను సక్రమముగా నిర్వహించిన దీక్షాధ్యక్షులు. సద్యః జ॥ శ్రీ జ. చ. ని. నిడు మామిడి నివాసము బెంగుళూరు గారు 63 మంది పురాతనుల పూజా సందర్భమున తేది 25 మే 1987న జరిగిన మహాసభలో ఈ "ప్రాచీన వీరశైవము" అను గ్రంథమును ఆవిష్కరించి యున్నారు. ఇది ప్రతి వీరశైవుడు తప్పక జదువదగినది. వీరశైవులకది దర్పణము వంటిది.

ఇంతకు పూర్వము వీరు వీరశైవ సోదరులందరకు అందుబాటులో నుండి,హృదయాహ్లాదకరముగా పాడుకొనుటకు వీలుండునట్లు రచించిన "వీరశైవ ధర్మభావ గీతికలు" అను చిఱుపొత్తమును ప్రకటించి యున్నారు. దీనికి స్వాగత సూచకముగా నీ "అక్షరాంజలి" ఘటించుచు, వీరింకను

ఇతోధిక సాహిత్యసేవచేసిన హృదయుల కృతజ్ఞతలకు పాత్రులు కావలసినది గను, అట్టి సదవకాశమును అనుగ్రహించవలసినదిగా నా పరమశివుని ప్రార్థించు చున్నాను.

శ్రీకర వీరశైవమతసింధు సముద్భవ సోముడోయన్
ప్రాకటవీరగోత్రమున ప్రాభవమందిన పూజ్యవీరనా
మాంకితునాగమాంబసతి, మానితపుత్రుని, రాచవీరసు
శ్లోకుని, దేవరాఖ్యుడను శోభితనాముని, సంస్తుతించెదన్

2. సంస్కృతమ్మున తీర్థ కన్నడము, జాణ
పరగ తెలుగున ఎం. ఓ. ఎల్ పట్టముంగొని
ఆంగ్ల హింద్యాదిభాషలనరసి చూచి
పంచభాషాప్రవీణుడన బరగితివి భువి

3. అరయ పండిత పరిషదధ్యక్షుడవయి
సంస్థ కొనరించి సేవ సముచితముగ
సభ్య పండిత మండలి సాధు—సాధు
అనగ పేరొందినాడవోయనఘమూర్తి

4. ఆంధ్రదేశమునందున నలరు చున్న
వీరమాహేశ్వరుల సభను విదితముగను
స్థాపితము చేసియధ్యక్షస్థానమూని
చక్కగానడుపు దేవరకు సాటియెవరు ?

5. మమత శ్రీవీరశైవధర్మమునుజాటు
పత్రికను నిర్వహించితోపదియువేండ్లు
మీదుధర్మాభినిరతికి మీదుకృషికి
"అక్షరాంజలి" శ్రీరాచవీరాభిదేయ

# తొలి పలుకు

బాల్యము నుండియు వీరశైవధర్మ సంస్కృతి—ఆచార—విచారముల ప్రభావము నాపై నుండుటవలన, మరియు మహాస్వాములు పండితులయొక్క సాంగత్యములో నుండుటచేతను, నాలోకరుడుగట్టుకొనిపోయిన సంస్కారం మెండుగా ధృవపడుటవలనను, వెలుపలనున్న అన్యమతములశక్తినన్నే మాత్రము ప్రభావితునిగా నొనర్పమి. కేవలము వీరశైవ ధర్మమునకై నన్నంకితముగా జేసికొనినాడను, పోగా నాయధాశక్తి మన వీరశైవధర్మోన్నతికై పాటుపడుతున్నా ; మన సమాజములోని కొందరు దుష్టశక్తులనేక విధముల నా మనస్సునకు బాధలు గల్పించినను వాటిని శివార్పిత దృష్టితో సహించి సామాజిక, సాంఘిక కార్యకలాపాల్లో సహృదయతతో పాల్గొనుచు మన వీరశైవ సమాజమునకు ఉడుతా భక్తివలె సేవ యొనర్చుచున్నాను. సాహిత్య రూపమున కొన్ని గ్రంధములను వ్రాసి ప్రకటించనైనది. కొన్ని అముద్రితములు గానే మిగిలి యున్నవి. ఉదార వంతులెవరైన ధనసహాయ మొనర్చిన యెడల వానినిగూడ త్వరలో వెలుగులోకి దేనగును.

ఈ వరకు ముద్రణరూపమునందుకొనిన చిఱు గ్రంధముల లోని 1 వీరశైవ ధర్మాన్వేషణము 2 రత్నత్రయము 3 నేనెవరు 4 బసవేశ్వరుని తత్వములు 5 మహాజ్ఞాని చన్నబసవన్న 6 ఇష్టలింగార్చనావిధిః 7 వీరశైవ తరుణ గేయములనునవి వెలుగులోనికి వచ్చినవి, చివర బేర్కొనిన వీరశైవ తరుణ గేయములను పాత్తము 1952 మే నెలలో వేయి ప్రతులను ముద్రింపగా నవి చేతులమీదుగా విక్రయింపఁబడి నావద్ద ఇప్పుడొక ప్రతి తప్ప మిగుల లేదు. కనుక కాస్తదాని శీర్షికను మార్చి అనగా "వీరశైవ

ధర్మభావగీతికలు" అనే శీర్షికతో ప్రకటింపబడుచున్నది. ఈ భావగీతికలు ప్రాచీన యతిప్రాస గణవిభజనాది సంకెళ్ళతో బంధింపబడక కేవలమాధునిక ఫక్కిలో గీతాలలోని భావ (విచార) తరంగములు శ్రోతల లేదా పఠితల (పాడు కొనువారి) హృదయఫలకలపై చెదరనిముద్రవైచి, మనస్సానంద డోలికలో కొంతవడి తేలియాడు నట్లుండుటకై ప్రయత్నించనైనది. తరజులు నేటి చలనచిత్రాల పాటల మాదిరి కొన్నియున్నను వాటిలో మన వీరశైవ ధర్మతత్త్వములే ప్రతిబింబితములై యున్నందున శ్రోతలకు పాడుకొను వారికి సుబోధకరములుగా నున్నవనుటలో సందియములేదు.

ఇంతకు పూర్వము 1974 (ఆనందనామ సం॥ము) ఆశ్వీజ శుద్ధ ౧౦ నాడు ఆరంభించిన "వీరశైవధర్మ తత్త్వప్రకాశిక" అను త్రైమాసిక పత్రికను 10 సం॥ములు నిర్వహించి ప్రస్తుతంలో దానిని ఆపి తత్స్థానె యీ చిఱుపొత్తములను ముద్రించి మన వీరశైవ సమాజ బాంధవుల కంద జేయుచున్నాను. సద్యః జ॥ శ్రీ జ. చ. ని. నిడు మామిడి నివాసము బెంగుళూరు గారు 63 మంది పురాతనుల పూజా సందర్భమున తేది 25 మే 1987 న జరిగిన మహాసభలో ఈ "ప్రాచీన వీరశైవము" అను గ్రంథమును ఆవిష్కరించి యున్నారు. ప్రతి వీరశైవుఁడు తప్పక దీనిని జదివియే తీరవలెను, వీరశైవ ధర్మమునకిది దర్పణము వంటిది.

కావున వీరశైవ ధర్మాభిమానులెల్లరు పత్రిక నిర్వహణకై ఇంత వరకు తోడ్పడినట్లుగానే ఈ పుస్తకముల ముద్రణకుగూడ చందా రూప మున గాని, అథవా విరాళాల రూపమునగాని, మిగుల అధిక సహాయ మొనర్చినచో వారికి నేనెంతయో కృతజ్ఞుడను.

ఇంకను నారచితములైన వీరశైవ ధర్మమునకు సంబంధించిన శ్రీ మదల్లమప్రభు, వైరాగ్యశిరోమణి అక్కమహాదేవి, ప్రతిజ్ఞాపూర్తి వంటి చిన్ననాటికలు, సాహిత్య గద్యరూపములైన శివానుభవమువంటి వ్యాసములు గల గ్రంథ సంపుటములు ఇంకను వెల్గులోకి రావలసి యున్నవి. కనుక యశఃకాములైన మహానుభావులు త్వరగా ముందుకు వచ్చి ఆర్థిక సహాయ మొనర్చిధన్యులు కాగలరని నా కోరిక,

ఇట్లు
గ్రంథకర్త
పం॥ రాచవీరదేవర, "M.O.L" "తీర్థ"
పెద్దమఠము
జోగిపేట మరియు సదాశివపేట.



మదీయవంశావళి

# దండకము

శ్రీ కరంబైన యాంధ్రప్రదేశంబునన్ మధ్యమాణిక్యమున్ బోలిబోనంబు కాధారమైనట్టి జిల్లాకు (మెదక్) తాలుకయందోలనన్ జేవళాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మతాధీశ్వరత్వంబుగైకొన్న శ్రీ సంగమేశాఖ్య మహేశ్వరుండొప్ప వీరేశగోత్రోద్భవుండైనసదాచారసంపన్న శీలుండు, ధీరుండు నౌనాతడా శ్రీమతిన్ శివ్వమాంబాఖ్య సాధ్వీమణిన్ బెండ్లియాడెన్ మహావైభవోపేతుడై, కొన్నినాళ్ళిట్లు మాహేశ్వరాచార శీలంబునందొప్పచున్. దానుసంసారనిర్వాహమున్ జేయుగాగల్గిరవ్వారికిన్ బుత్రరత్నంబులారాచయార్యుండనన్. శంకరాచార్యుండు, పంచాక్ష రాఖ్యుండనన్, శ్రీ షడక్షర్యభిఖ్యుండనన్, వీరయార్యుండునానేవురున్ బేర్మివర్ధిల్లగానందుఁబంక్షరీనాముడైక్యంబునొందగన్ శేషించునానల్వురన్ జేష్ఠుడౌరాచయాఖ్యుండురాణించె నింటన్ వహించెన్ స్వసంసార భారంబు, శ్రీ శంకరార్యుండు పాపన్నపేటన్ మఠాధీశుడై యుండిరాజిల్లగాస్వామియా శ్రీషడక్షర్యభిఖ్యుండుతా జోగిపేటన్ స్థితుండై సదాశివ్వపేటన్ మఠా ధీశతన్ బూని రాజిల్లె. వైరాగ్యతేజోవిశేషంబు మన్నించుచున్ భక్త బృందంబు పాదార్చనల్ సేయగా శీలతన్ దక్షతన్ బూజ్యతన్ గ్రాలుచున్ దానధర్మాది సత్కారముల్ సల్పుపుణ్యాత్ముడై (గొల్లశానామమున్ జెందఁగా) కొల్లగాకీర్తులన్ బొందగా, వీరలన్ జిట్టితమ్ముండు వీరయ్యకున్ జేష్ఠుడౌ బుత్రురాచయ్యనున్ దాస్వపీఠంబునన్ నిల్పెనీరీతి సామాజిక శ్రేయమున్ గోరుచున్ వేడ్కమై లింగపూజాధురీణుండునై యుండఁగానంతనాశంకరుండున్ సదామోదకారున్ నిజాధీనమునన్ జేర్చి కైలాసవాసున్ దగన్ జేసెన్॥

సీ॥ పరమేశుఁజేరెనాభ్రాతయని తలంచి
వగచి వీరయతన భ్రాతృపదవి
కైలాతివారు రాజాలరనిగణించి
తనదు పుత్రుని గొనినిల్పెముదమున
వేడ్కనతఁడిట్లులావీరసుతుగూడి
తనదు భక్తులమదుల్ తనియజేసె.
బాలుండు ముద్దులౌపలుకులు వినిపింపఁ
వత్సలత దానతనిఁబంపెబడికి

తే॥ గీ॥ పిదపఁదల్లితండ్రి పెద్దకొమరుఁజూచి ।
నెనరుతోయతీశ్వరునకొసంగ ।
నతఁడు స్వీకరించికుతుకమ్ముతోఁబెంచి ।
కారణాలు గరుపిఁజేరెశివుని ॥

తే॥ గీ॥ యతికి సోదరుఁడైన వీరయ్యయంత ।
అప్పుడివికేగ బాలునినాదరించు
వారుతేరని తాఁదెచ్చిగారవమునఁ ।
బెంచుచుండెను దాక్షోగిపేటఁజేరి ॥
(కై. వా. శివశ్రీ మతము సిద్ధివీరయ్యడాకూరుగారి కృతిద్వయము)

తే॥ గీ॥ శ్రీకరుఁడు వీరశైవాబ్ధిశీతకరుఁడు
ప్రథితిగుణుఁడు శ్రీ వీరయాహ్వాయబుధుండు
తనదుపుత్రురాచయకు విద్యలనునేర్పి
యరిగెగైలాసమునకుఁదానంతమందు ॥

కం॥ శ్రీ వీరయాఖ్యసుగుణికి
బేదిమి పుత్రుండురాచవీరయకరమున్

గూరిమితోడను విద్యల
వేరిచెపిత్రుభక్తిగల్గి నెగిడెదునెపుడున్ ॥

## (స్వీయకృతులు "శివశ్రీ")

శ్లో॥ మాతామేనాగమాంబాచ
వీరార్యాచపితామమ ।
తయోఃజేష్ఠపుత్రోహం
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ సంస్కృతాంధ్రాంగ్లభాషాసు
హిందీకర్నాటకేషుచ ।
పంచభాషాప్రవీణో2హం
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ ఈశ్వరాఖ్యామహాసాధ్వీ ।
సంగాఖ్యావిదుషీమణీ ।
తాభ్యాంప్రణయ బంధస్తు ।
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ ఏకాభార్యా మహాగుణవతీ, ఈశ్వరాఖ్యాసుశీలా ।
అన్యాభార్యా గృహకర్మ ధర్మనిరతా, సంగాఖ్యానిదుషీమణీ
ఉభావేతౌ సహజానురాగ నిరతావేకోదరాజ్జాతావివ ।
ఏతాభ్యాంహృదయైక ప్రాణపతి రహంరాచవీరాఖ్య దేవరః ॥

శ్లో॥ ప్రథమోమే బసవరాజాఖ్య దేవరః ।
ద్వితీయోమే, ప్రభులింగాఖ్య దేవరః ।
తృతీయామె, పుత్రీ, శివరాణ్యాఖ్యాసుశీలాహిసా ।
జనకస్తేషామహం, శ్రీరాచవీరాఖ్యాదేవరః ॥

# (రత్న పంచకము)

1 స్మరణము చేసినంతనె విశాలతమస్సుల పారద్రోలుచున్
కరుణలు నిండు చూపులను కాంచుచునుండెడి కన్నతండ్రులై
వరలెడి శివపార్వతులు వన్నెలు, చిన్నెలు భోగభాగ్యముల్
కరుణను "రాచవీరునకు" ఆశిషమిచ్చును భ్రామరాంబికే

2 మహిని వెలుగుచుండు మర్యాద వంశంబు
సింధువందు తాను శీలయుతుఁడు
వీరశైవ మతమును విరివిగా వ్యాపింప
నిరంతర కృషి చేసినట్టి రాచవీర !

3 వీరశైవమందు పేరు తీరులు కలిగి
తండ్రి వీరయాఖ్య, తల్లి నాగమాంబ
ముద్దుల తనయుండు వీరవరుడు
వైవిధ్య సాహిత్య బలుడు శ్రీ "రాచవీర"

4 స్వంత నిత్య కృషితోడ ఇంతవరకు
వీరశైవ విద్యా సంపదల విరివిగా నార్జించి
వినయ శీలముతోడ యశమును గాంచిన
శాంతమూర్తి పండిత శ్రీ "రాచవీర"

5 వీరశైవ పండిత "రాచవీరునకు"
నిండినవి అరువది మూడు వత్సరములు
మెండుగ హర్ష పూరిత యశస్కుడై
నిండుగ నూరేండ్లు జీవించుగాక !

ఎమ్. శివశంకరయ్య స్వామి
హిరేమఠ్ "బొమరసుపేట"

మఠం 'లింగయ్య స్వామి' M. A
లెక్చరర్, అంబేడ్కర్ కళాశాల, హైదరాబాద్

సంస్కృతాంధ్రాంగ్ల కన్నడ హిందీ ఇత్యాదిబహు భాషాకోవిదులై, దశాధిక గ్రంథకర్తలై ప్రఖ్యాత సాహిత్య వేత్తగాపేరుగాంచి, "పండితరత్న" "ధర్మనిరత" "సాహిత్య విశారద" ఇత్యాది బిరుదాంకితులై, సుస్థిర యశో విభూషణ విరాజితులై వెలుగొందు పం॥ శ్రీ రాచవీరదేవర గారి కృతి గురించి అభిప్రాయము వెలిబుచ్చుట సాహసమే అగును. శ్రీ వారి వాత్సల్య పూరిత ఆజ్ఞాబద్ధుడనై ఈ ప్రయత్నము చేయడమైనది.

వీరశైవము మహోత్కృష్టమైనది. దీనితో సరితూగ గల మతము ముల్లోకములలో లేదని పారమేశ్వరాగమము ఘంటాపథముగా చాటి చెప్పు చున్నది. ఆగమములలో వివరింపబడిన ఈ వీరశైవము అత్యంత ప్రాచీన మతమై యున్నది. కొందరు దీనిని శ్రీ బసవేశ్వరుడు స్థాపించిన మతమని ప్రతిపాదించుటకు విశ్వ ప్రయత్నము చేయుచున్నారు. కర్ణాటకము లోని ఉద్దండ పండితులు అట్టి అప్రమాణికమైన, అసత్య సాహిత్యమును తమ అసామాన్య విమర్శనాత్మక విశ్లేషణాత్మక పరిశీలనల ద్వారా ఖండించి "వీరశైవ ప్రాచీనత్వము" ను నిర్ద్వంద్వముగా నిరూపించుచున్నారు. కాని తెలుగు దేశములో ఒకప్పుడు తెలుగు కవితా లోకమున నీరాజనాలనందు కొన్న వీరశైవము నేటి సాహితీ జగత్తులో అనాదరణకు గురిఅయినది. ప్రామాణికమైన వీరశైవ గ్రంథముల కొరత ఎంతో కలదు. ఇట్టి విపత్కర పరిస్థితిలో కొందరు అన్యవాదాభిమానులు వీరశైవాన్ని అగౌరవ పరిచే విధముగా అసత్యనిరూపణల ద్వారా ఈ మతము కేవలము క్రీ॥ శ॥ 12 వ శతాబ్దిలో స్థాపించబడినదని పదే పదే ప్రకటించుచున్నారు. ఈ వాదాన్ని ఖండించడానికి లిం॥ బండారు తమ్మయ్య లాంటి కొందరు ప్రయత్నించిరి.

అయినను ప్రతిఘటన బలహీనముగా నున్నందున పరవాదుల ప్రచారము నిరాఘాటముగా కొనసాగుచున్నది. అట్టి అసత్య ప్రమాణరహిత కుయత్నాలను వమ్ముచేయవలసిన తరుణంలో ఈ గ్రంధమును వెలువరించిన శ్రీ పం॥ రాచవీర దేవర గారు అభినందనీయులు. వీరశైవ జాతి గౌరవాన్ని కాపాడటానికి ఉపకరించే వీరి ప్రయత్నము అత్యంత శ్లాఘనీయము.

ఈ గ్రంధములో వీరశైవ ప్రాచీనత్వాన్ని నిరూపించడానికి విశదీకరించిన ప్రమాణాలు బహుముఖములైనవి. వేదమంత్రార్థవివరణలు, ఆగమ సిద్ధాంతాలు, సాహిత్యపరమైన ఆధారాలు, చారిత్రాత్మక ప్రమాణాలు మొ॥ వాటిద్వారా సత్యనిరూపణము చేయడమైనది. నవనందాది సామ్రాట్టులు వీరశైవులని ప్రకటించడము ఎంతో సంతోషకరమైన విషయము. కొందరి శివశరణుల చరిత్రలను సుబోధకమైనశైలిలో వివరించడం కూడ జరిగినది.

గ్రంధములోని విషయ సముచ్చయమెంతో మోదాన్ని కలిగించినా, కొన్ని అంశములు గమనార్హములు, గ్రంధస్థ విషయములు ఒక విస్పష్ట క్రమములో అధ్యాయములుగా వర్గీకరించిన యెడల ఈ గ్రంధమునకు ఇంకను వన్నె వచ్చెడిది.

ఇక ముందు అత్యుత్తమ ధార్మిక సాహిత్య సృష్టికి వలయు ప్రేరణను పుష్టిని పం॥ రాచవీరదేవరగారికి సదాశివుడు ప్రసాదించాలని ఆశిస్తున్నాను:- ఇట్లు మ॥రా॥ం లింగయ్య స్వామి ఇం. నెం. **1-3-650,** కవాడిగూడ సికిందరాబాదు.



# ప్రశంసన పద్యాలు

సమర్పణము

శ్రీ ఎస్, పిళ్ళలోకాచార్యులు, M. A., & M. O. L.
భాషాప్రవీణ, సీనియర్ తెలుగు పండితులు

శ్రీ రాచవీరదేవర !
భూరియశః, కిరణజాల పూర్ణగురువరా !
శ్రీరమ్య వీరశైవజ (వీరవంశజ)
నారాధిత పాదపద్మ ! ఆచార్యవరా !

మాటలులేనివాఁడు, కడు
మన్ననతోడుతనున్నవాఁడు, మో
మాటము చూపువాఁడు, మరి
మోసము చేయనివాఁడు, ధాత్రినా
రాటము చూపకెప్పుడును
రంజిలువాఁడు ప్రవర్తనంబునన్
సాటికి సాటికెవ్వడును రా
జాలడు దేవరతోడనిచ్చలున్ ॥

విద్దెలమిన్న అంతకునుపెద్ద, పవిత్రపు వర్తనంబునన్
హద్దులులేనిబత్తి, హరునందును, దేశికునందు భక్తులం
దద్దయునాదరమ్ము శరణార్థులయందును చూపించునందునన్
ఎద్దునునెక్కురౌతుసిరులిచ్చుతనీకును వీరదేవరా !

# సన్నిహిత మిత్రుని యభిప్రాయము

పండితరత్న భూషిత—వరదజాణ
కావ్యతీర్థ ధర్మనిరత—కవియుశ్రేష్ఠ
రాచవీరదేవర శివ—రహాయుపుదము
మానసవిహారమమతయు—మధురసీమ ॥

సంస్కృతాంధ్రనిష్ణాతయు—సరసవశాళి
"వీరశైవధర్మ" ప్రకాశ—వీరశూర
శంకరానందప్రియమూర్తి—శక్తికొలది
శ్రీయు బసవేశ్వరుని భక్తి—సిరినిగూర్చు ॥

సాహిత్య వాచస్పతి
రాచోటి శంకరశాస్త్రి M. A.
హిందీ విభాగాధ్యక్షుడు
గవర్నమెంటు సి. టి. కాలేజి
హైదరాబాదు.



ఆ॥ వె॥ తల్లి "నాగమాంబ" తండ్రి వీరయాఖ్య
పుణ్యదంపతులకు, బుట్టినట్టి
"రాచవీరదేవరాచార్యవర్యుండు"
నిండు నూరుయేండ్లు ఉండుగాత, ॥

తే॥ గీ॥ స్వంత కృషితోడ "దేవర" యింతవరకు
విద్య, పదవుల, నార్జించి వినయశీల
సంపదల చేత యశమును నింపుకొనిన
సాధు జీవిత స్ఫూర్తి సుశాంతమూర్తి ॥

ఆ॥ వె॥ వీరశైవమతము, విరివిగావ్యాపింప
పెద్దమతమునెంతొ యుద్ధరించి
శక్తికొలది భక్తిముక్తి బీజములను
నాటె, పాటు బడిన మేటి యోధు ॥

తే॥ గీ॥ పత్రికను నడిపి మంచి సంపాదకులుగ
శైవ; పండిత సభలకు సారధులగ
బాలురకు విద్య గరుపిన పండితులుగ
ఇట్టి జనహిత సేవలో గట్టి దిట్ట ॥

ద్వి॥ దినదినం సుయశస్సు "దేవర" గారు
ఘనముగా నార్జింపకాంక్షింతుసతము

ఇట్లు
సంగమేశ్వర్ "సంగమ్" కవి
మెదక్ జిల్లా రచయితల సంఘాధ్యక్షులు. జోగిపేట



వే॥ పం॥ రాచవీరదేవర పెద్దమఠము

"తీర్థ" & M. O. L.

అధ్యకులు : ఆం. ప్ర. వీరమాహేశ్వర (జంగమ)

మహాసభ హైదరాబాదు.

ఇ. నం. 3-3-139, కాచిగూడ, హైదరాబాదు-27 (ఆం. ప్ర.)

॥ ఓం ॥

"శ్రీ మజ్జగద్గురు పంచా చార్యే భ్యోనమః"

# ప్రాచీన వీరశైవము

శ్రీ మద్వేదాగమోపనిషత్ పురాణేతి హాసాది ప్రమాణ ప్రసిద్ధము, శిలాశాసన ప్రోక్తనావ శేషాది ఆధార యుక్తము, శివశరణుల విలువైన వచన శాస్త్రాధార యుక్తము, స్వదేశ పరదేశములకు జెందిన ఐతిహాసిక ప్రసిద్ధ పురుషుల లేఖల ఆధారమునను, అనాది సంసిద్ధమైనదని నిర్ణయిం చబడిన ప్రఖ్యాత వీరశైవ సనాతనత్వమును ఈ గ్రంథమున పైన నుట్టం కించిన సమస్త ఆధారముల చేతను నిర్ణయించనైనది. (సిద్ధాంతీకరించ బడినది)

# వీరశైవ ధర్మము యొక్క పుట్టుక

నిరాకారుఁడైన పరశివుఁడు జగన్నాటక సూత్రధారియై తనలీలా వినోదమునకై సాకారుఁడై, పంచముఖములు, దశభుజములు, త్రినేత్రము లతో విరాజిల్లెను, ఆ పంచముఖములనే, 1. సద్యోజాత 2. వామదేవ 3. అఘోర, 4. తత్పురుష, 5. ఈశాన్యములను నామములతో ప్రసిద్ధియయ్యెను.

## అట్టి పంచముఖముల నుండి క్రమముగా

1. రేణుక, 2. దారుక, 3. ఘంటాకర్ణ, 4. ధేను (శంఖ) కర్ణ, 5. విశ్వకర్ణులను, పంచ ప్రమథులుద్భవించిరి, వారే జగత్ ప్రసిద్ధిగాంచిన పంచాచార్యులైరి.

అప్పుడు పరమశివుడు ఇట్టి పంచాచార్యుల నాహ్వానించి విష్ణు బ్రహ్మేం ద్రాది దివిజులకు, లక్ష్మి సరస్వతీ మున్నగు శక్తులకు, మను, మునులం దరికిని లింగధారణజేసి, భూలోకమున లింగముఖమ్ములనవతరించి పంచ పీఠములను స్థాపించి వీరశైవ ధర్మమును వ్యాపింపఁ జేయుడని యాజ్ఞా పించెను. అప్పుడు

## 1 శ్రీ రేణుకా చార్యుల వారు

భాగ్యనగర్ (హైదరాబాదు) ప్రాంతమునకు జెందిన కొలనుపాక శ్రీ సోమేశ్వర లింగమునుండి యుద్భవించి రంభాపురి (బాళేహళ్ళి) లో శ్రీ వీరసింహాసనమును నెలకొల్పిరి.

వీరు కృతాయుగమునందు ఏకాక్షర శివాచార్యులనియు, త్రేతా యుగము నందు ఏకవక్త్ర శివాచార్యులనియు, ద్వాపారమునందు రేణుక శివాచార్యులనియు, కలియుగములో రేవణసిద్ధ (రేవణారాధ్యుడు) డనియు ప్రసిద్ధి గాంచియున్నారు.

వీరు :— కృతాయుగమునందలి అగస్త్య మహామునికి వీరశైవ సిద్ధాంతము నుపదేశించి యున్నారు. మరల త్రేతాయుగమునందు విభీష ణుని ప్రార్థన మేరకు ఒకే ముహూర్తములో మూఁడు కోటి శివలింగము లను స్థాపించిరి. ద్వాపారయుగములో ననేకమహిమలను ప్రదర్శించవదను

చేత రేణుకతీర్థము, రేణుకసరోవరములని ప్రసిద్ధిగాంచినవి. కలియుగమున విక్రమ, చోళ, బిజ్జళ మున్నగు ననేక రాజుల నుద్ధరించి, హావిన హాళ కల్లయ్య, మడివాళమాచి దేవునకు గురుపుంగవులైన శ్రీ మల్లికార్జునస్వామి మొదలగు వారికి శివదీక్షను జేసి, సొల్లాపురము శ్రీ సిద్ధ రామేశ్వరుని యొక్క భవిష్యత్తు జన్మను వారి తల్లిదండ్రులకుఁదెల్పి గోరక్షకు ఖర్పరాదుల సర్వమును భంగపరచి శ్రీ శంకరాచార్యులవారి ప్రార్థన ప్రకారము వారికి సర్వసిద్ధి ప్రదాయకమైన శ్రీ చంద్రమౌళీశ్వర నామక లింగమును మరియు రత్నగర్భ గణపతిని అనుగ్రహించి కల్యాణ బసవేశ్వరుని సోదరి యైన అక్కనాగమ్మకు ఇంగళేశ్వర గుహలో శివయోగము యొక్క సకీల ముల రహస్యాన్ని గరుపి, కల్యాణ పట్టణమునకు ప్రధానియగు, భక్తికి బీజమైన శ్రీ బసవేశ్వరుని ప్రాసాద భవనమునందు, క్రియామూర్తియై తరువాత తమ స్థానమున రుద్రముని దేవరనునిల్పి భారతమునందంతట సంచరించి చివరికి తాముద్భవించిన కొలనుపాక శ్రీ సోమేశ్వర లింగము నందే ఐక్యమై శివసాన్నిధ్యమునుఁజేరిరి. (వీరికి సంబంధించిన సమస్త మహిమలతో గూడిన రేవణ సిద్ధేశ్వర చరిత్రను బఠించి సమస్త విషయముల నవగతము జేసికొనవలెను)

## 2 శ్రీ దారుకాచార్యులు

మహారాష్ట్రమున విక్రమాదిత్య ప్రభువు యొక్క రాజధానియైన ఉజ్జయిని వటక్షేత్రమునకు సంబంధించిన శ్రీ సిద్ధలింగేశ్వర లింగము నుండి యుద్భవించి, అచటనే శ్రీ సద్ధర్మ సింహాసనము నెలకొల్పిరి, కాలాను గుణ్యముగా, కారణాంతరముల చేత, ముందొచ్చిన జగద్గురువులు తమ పీఠమును కర్నాటకములోని ఉజ్జయినికి మార్చియున్నారు.

వీరు :— కృతాయుగములో ద్వ్యక్షర శివాచార్యులనియు, త్రేతా యుగమున ద్వివక్త్ర శివాచార్యులనియు, ద్వాపార యుగమునందు దారుక

శివాచార్యులనియు, కలియుగమున మరుళ సిద్ధ (మరుళారాధ్యులనియు) శివాచార్యులనియు ప్రసిద్ధిగాంచిరి.

వీరు :— లోక ప్రసిద్ధులైన దధీచి మహర్షి యొక్క ప్రార్థన మేరకు శివసిద్ధాంతము నుపదేశించి తమకు శిష్యునిగావించుకొని, లోక ప్రజలను భయకంపితులనుగా జేయుచున్న కొల్లాపురము మాయయొక్క గర్వమును భంగపరచి లోకమున ప్రశాంతతను నెలకొల్పి, దేవనందనుడను రాజభక్తికి ప్రసన్నుండై యాతనికి శివసిద్ధాంతము నుద్బోధించి, మోక్షమును బడయుట కర్హునిగా జేసి, చివరకు మల్లికార్జున శివాచార్యులను వారికి తమ ఉత్తరాధికారము ననుగ్రహించి భూమండలము నందంతట బర్యటించి తాముద్భవించిన వటక్షేత్రములోని సిద్ధేశ్వర లింగమునందే ఐక్యమై శివలోకమును జేరిరి. వీరి పేరిట దారుకేశ్వరతీర్థము, దారుకేశ్వరక్షేత్రములని కాశిక్షేత్రమున యిప్పటికిని విరాజిల్లుచున్నవి. కొన్ని చోట్ల మరుళ సిద్ధేశ్వర క్షేత్రములు వెలసి యున్నవి. ఈ మహాత్ముల విషయమై మరుళ సిద్ధేశ్వర చరిత్రను బఠించినట్లయితె సవిస్తారముగ బోధపడుతుంది.

## 3 శ్రీ ఘంటాకర్ణ శివాచార్యులు

ద్రాక్షారామ క్షేత్ర (హిమాలయ పర్వత)ము యొక్క శ్రీరామనాథ లింగము నుండి యుద్భవించి హిమాలయమునందే శ్రీ వైరాగ్య సింహాసనమును స్థాపించిరి. ద్వాపరయుగమున బాణాసురుని పుత్రిక మరియు అనిరుద్ధుని భార్యయగు ఉషాదేవి. ఆ మఠమును జీర్ణోద్ధారము గావించుట వలన దానికి ఉషా మఠమనియు పేరుగాంచినది. ఆ ఉషామఠమే రానురాను క్రమేపి-ఊఖిమఠమని ప్రసిద్ధి జెందినది.

వీరు :— కృతాయుగమున త్ర్యక్షర శివాచార్యులనియు, త్రేతాయుగమున త్రివక్త్ర శివాచార్యులనియు, ద్వాపరయుగమున ఘంటా

కర్ణ శివాచార్యులనియు, కలియుగమున ఏకోరామారాధ్య శివాచార్యులనియు, ప్రఖ్యాతి జెందిరి.

వీరు :— పదునెనిమిది మహాపురాణములను రచించి జగత్ ప్రసిద్ధి జెందినట్టి వ్యాస మహర్షి యొక్క ప్రార్థనమేరకు. శివ సిద్ధాంత తత్త్వము నుపదేశించి శిష్యునిగా జేసికొని యున్నారు. గౌతమేంద్ర నామముగల చక్రవర్తిని అనుగ్రహించి పరమ శివభక్తునిగా నొనర్చిరి. జనమేజయ మహా రాజు ఒకవేయి గ్రామములున్న భూమిని యీ పీఠమునకు దానమొసంగి యుండెను. సద్యః ౧౪౧ (141) గ్రామములు మాత్రమే వీరి యధీనము నందున్నవి. కేదారేశ్వరము మొదలగు 22 క్షేత్రముల అధికారమును (ఆధిపత్యమును) ఈ పీఠాధిపతు లేవహించి యున్నారు. ఇట్టి పీఠమునకు శిష్యులైన మెహరి మహారాజుగారు పీఠాధిపతులకు ''రావల్'' అను బిరుదము నొసంగి మహాగౌరవముతో సేవించి యున్నారు. మరియు ఉదయపురము, కాశ్మీరము, నేపాళము, మున్నగు ౧౩ (పదముగ్గురు) రాజులు ప్రతి సంవత్సరము ఈ పీఠమునకు కానుక లొసగుచునేయున్నారు.

ఈ పీఠాచార్యులు కలియుగమునందు ఏకోరామారాధ్యులనుపేరుతో రామనాథ లింగమునుండి యుద్భవించి భూమండలమున బర్యటించి యనేక మహిమలను బ్రదర్శించి యదే లింగమునందు ఐక్యమై శివసాన్నిధ్యమును బడసిరి. (హెచ్చు వివరములకై వీరి చరిత్రమును బఠించి దెలియందగును.)

## 4 ధేనుకర్ణ శివాచార్యులు

శ్రీ శైలక్షేత్రము (భూకైలాసమనందగు) యొక్క శ్రీ మల్లికార్జున లింగము నుండి యవతరించి శ్రీ శైల క్షేత్రమునందే సూర్య సింహాసనమును నెలకొల్పిరి. వీరు కృతాయుగమున చతురక్షర శివా

చార్యులనియు, త్రేతాయుగమున చతుర్వక్త్రి శివాచార్యులనియు, ద్వాపార యుగములో ధేనుకర్ణ (శంఖుకర్ణ) శివాచార్యులనియు, కలియుగము నందు పండితారాధ్య శివాచార్యులనియు ప్రసిద్ధి జెందిరి.

వీరు :— సానంద మహర్షికి వీరశైవ సిద్ధాంతము నుపదేశించి తమకు శిష్యునిగా జేసికొని యున్నారు. వీరికి శంఖు కర్ణులని మరో అభిధానముంది మరియు నాపేరుగల మూర్తిగూడ యున్నది. అట్టి శంఖు కర్ణ విగ్రహాన్ని బూజించిన వారికి అశ్వమేధ యాగమును జేసిన దాని కంటెను పదింతల ఫలములభించునని వ్యాసమహర్షిగారు ధర్మరాజునకు దెలియ పరచినారు.

మరియు హరప్రియుడను పింగళుని తండ్రియైన శ్వేతునకు శ్రీ శైల క్షేత్రమునందు సదానంద లింగజంగములను జగద్గురువులున్నారు. వారిని సేవించినచో వారియనుగ్రహము చేత నీ పుత్రుడైన పింగళుడు రోగమునుండి విముక్తుడగునని జెప్పియున్నారు. కలియుగములో పండితారాధ్యులవారు అదే లింగమునుండి యుద్భనించి భూమండలమునంతటిని బర్యటించి యనేక రాజుల నుద్ధరించి చివరికి తాముద్భవించిన లింగము నందే ఐక్యమై శివసాన్నిధ్యాన్ని బొందిరి.

## శ్రీ విశ్వ కర్ణ శివాచార్యులు

శ్రీ మహా పవిత్రమైన కాశీక్షేత్రమునందు శ్రీ విశ్వనాథజ్యోతిర్లింగమునుండి యుద్భవించి శ్రీ కాశిక్షేత్రమునందే జ్ఞాన సింహాసనము నెలకొల్పియున్నారు.

వీరు :— కృతాయుగములో పంచాక్షర శివాచార్యులనియు త్రేతాయుగమునందు, పంచవక్త్రి శివాచార్యులనియు, ద్వాపార యుగములో

విశ్వకర్ణ శివాచార్యులనియు, కలియుగములో విశ్వారాధ్య శివాచార్యులనియు ప్రఖ్యాతి వహించిరి.

వీరు :— లోకప్రసిద్ధులైన దుర్వాస మహాఋషి ప్రార్థన మేరకు అతనికి శివతత్త్వోపదేశము నుపదేశించి తమకు శిష్యునిగా జేసికొని, మరియు నేపాళము, కాశ్మీరము మొదలగు దేశాధిపతులకు వీరశైవ సిద్ధాంతము నుపదేశించి చివరకు దానవతరించిన విశ్వనాథ లింగమునందే తమ దివ్య దేహమును ఐక్యమొందించిరి.

క్రీ. శ. 6. వ, శతాబ్దియందున్నట్టి జయనందన దేవుడను రాజు ఈ పీఠమునకు భూదాన మొసంగి యున్నాడు, నేపాళ దేశమున ఈ పీఠమునకు సంబంధించిన శాఖా మఠము జంగమ వాడి మఠమను పేరుతో నిప్పటికి విరాజిల్లు చున్నది. పూర్వము విశ్వమల్ల నృపతియను నేపాళరాజు ఈ మఠమునకు అనేక జహగీరు (అగ్రహారము)లను దాన మిచ్చినట్లు సంస్కృత శిలాశాసనము దెల్పుచున్నది. ఈ పీఠమునకు హిందు మహారాజులే గాకుండ మొగలు చక్రవర్తులైన హుమాయూను, అక్బరు, జహాంగీరు, షహజాను, ఔరంగజేబు, మహమ్మదుషా, మొదలగు వారందరు గూడ అనేక జహగీరులను (అగ్రహారము)లను దాన మొసగి యున్నారు. అప్పుడు వీరు వ్రాయించి యిచ్చిన దాన శాసనములు ఇప్పటికిని ఈ పీఠాధిపతుల వద్ద నున్నవి.

ఈ విధముగ జగద్గురు పంచాచార్యులు పరశివునానతి మేరకు భూమండలము నందవతరించి, వీరశైవ ధర్మమును స్థాపించి, దాని యభివృద్ధికిగాను తూర్పున, శివకంచి, కన్యాకుమారి, పర్యంతము, దక్షిణమున కుంభకోణము—రామేశ్వరము— (సేతుబంధము) లంకవరకు, పశ్చిమమున గోకర్ణము—సౌరాష్ట్రము వరకు, ఉత్తరమున కాశ్మీరము నేపాలు వరకు

శాఖా మఠముల నెలకొల్పి అట్టిమఠముల పరిపాలనమునకుగాను పట్టాధికారులను నియమించి అట్టి చర పట్టాధికారుల యధీనమున ప్రతియొక్క గ్రామమునకు ఆయా గ్రామములకుఁదగినట్లుగా ఒకటిగాని, రెండుగాని, అథవా నాల్గు ఎనిమిదిగాని, ఇంతకంటె అవసరాన్ని బట్టి ఇంక నధికముగాగాని మఠములను స్థాపించి, వాటన్నింటిలో నొకటి ప్రధానమైనదిగా పెద్దమఠము (హిరేమఠ)గాను, మిగతవన్ని దాని యధీనమున చిన్న మఠములు గాను, నియమించి యామఠములందు గృహస్థాశ్రమ మఠాధికారులను (లేదా దేశిక స్వాములను) కొన్నిచోట్ల దేశికమూర్తులను, వారి యధీనమున మఠపత్తి గుణారి, గణాచారి, స్థావరశెట్టి అను వతన్‌దార్లను (వంశపారంపర్యాగతాధికారులను) నియమించి వారికి సహాయకులుగా దైవపు వారిని యెన్నుకొని (గ్రామ పెద్దలను యోగ్యులైన వారిని) భక్తుల అథవా మహేశ్వరుల ప్రతి యొక్క శుభాశుభ కార్యములు నిర్విఘ్నముగా నిర్వహింపఁబడునట్లుగా, లింగధారణ—దీక్షా—వివాహాదికార్యములందు పంచపీఠాధిపతుల పేరిట పంచ కలశములను స్థాపించి ఆయాకార్యములను జరుగు నటుల సువ్యవస్థగావించి యున్నారు. అట్లుగాక ఈ యన్ని కార్యములు, ఆచార విచారములు లోపించ కుండ, అవకతవకలుగాకుండ భద్రపరచి యున్నారు.

ఈ ప్రకారముగా నవతరించిన పంచపీఠాధీశ్వరుల వంశ పరంపరలో కలియుగపు ఆదినుండియు పీఠముల నధిరోహించిన భగవత్పాదులలో

శ్రీ మద్రంభాపురి వీరసింహాసనము నధిరోహించిన మహాత్ములలో గతంలో మహాత్ములై యనంత లీలలను బ్రదర్శించి, జగద్విఖ్యాతులైన ౧౦౦౮ వీరగంగాధర శివాచార్యులవారు ౧౧౯ (119) భగవత్పాదులు. వీరు లింగైక్యులైనారు. వీరి స్థానమున సద్యః పీఠము నలంకరించి యున్న వారు శ్రీ జ|| వీరరుద్రముని శివాచార్య మహాస్వాములు ౧౨౦

శ్రీమదుజ్జయినీ సద్ధర్మ సింహాసనము నలంకరించిన మహాత్ములలో 1008 శ్రీ సిద్ధేశ్వర భగవత్పాదులు 109వ వారు.

శ్రీ హిమవత్కేదార వైరాగ్య సింహాసనాధీశులైన మహాత్ములలో 1008 శాంతలింగ శివాచార్య భగవత్పాదులు 290వ, వారు. వీరులింగైక్య మైనారు. వీరిస్థానములో మరో మహాస్వాములవారునూ తన పట్టాధి కారులైన 300,వ, వారైనారు.

శ్రీశైల సూర్య సింహాసనాధీశులైన మహాత్ములలో శ్రీ 1008 జ॥ వాగీశ పండితారాధ్యులవారు, తమ వృద్ధాప్యమువలన సద్యః జ॥ ఉమాపతి పండితారాధ్యుల వారికి పట్టాభిషిక్తుల గావించియున్నారు. (వీరి సంఖ్య పరిశోధనలోనున్నది.)

శ్రీ కాశీజ్ఞాన సింహాసనాధీశులైన మహాత్ములలో 1008 శ్రీ జ॥ విశ్వేశ్వర శివాచార్యులవారు పీఠమునలంకరించి యున్నారు. (వీరి సంఖ్యను పరిశోధించవల్సియున్నది.)
వేదములలోను

ఋ॥ పవిత్రంతేవితతం బ్రహ్మణస్పతే, ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్తతనుర్నతదామోఽశ్నుతె శృతాస ఇద్వహంతస్తత్సమా శతః॥
"పవిత్రంతెవితతం బ్రహ్మణస్పతె" అను మంత్రార్థమిది

తా॥ ఓయి బ్రహ్మణస్పతి ! నీ వత్యంత పవిత్రుండవు, అందుచేత నా యొక్క స్థూల-సూక్ష్మ-కారణ శరీరములందు ఇష్ట-ప్రాణ-భావాది లింగ రూపమున వ్యాపించి యున్నావు. శివదీక్షాసంస్కారము లేని వాఁడు ఎన్నటికిని నిన్నుబొందలేడు. మేము నిన్నాశ్రయించి కృతార్థు లగు నట్లుగా అనుగ్రహించుము.

శ్లో॥ "వేదశాస్త్ర పురాణేషు-కామికాద్యాగమేషుచ, లింగధారణ మాఖ్యాతం-వీరశైవస్య నిశ్చయాత్॥ అని సిద్ధాంత శిఖామణి యొక్క లింగ ధారణ స్థలమునందు నిరూపించి యున్నారు.

ఈ పవిత్రమైన ధర్మముయొక్క ప్రధాన చిహ్నము ఇష్ట లింగ ధారణము. ఇట్టి లింగధారణ విషయము ఋుగాది వేదములలోను, ఈశా వాశ్యాద్యుపనిషత్తులందును, కామికాద్యాగమములందును, వ్యాసోక్త పురాణములందును, రామాయణ - మహాభారతాది ఇతిహాసములందును, ఘంటాపథముగా వివరించబడి యున్నది. ఇదేవిషయమును వీరశైవమత సంస్థాపకులైన శ్రీ జగద్గురు రేణుకాచార్యులవారు అగస్త్య మహర్షుల వారికి వీరశైవధర్మ సిద్ధాంతమునుపదేశించు సందర్భమున

ఈ మంత్రమునకు వీరశైవధర్మ సిద్ధాంతపరముగా "సిద్ధాంత శిఖామణి" అను ధర్మగ్రంథమున జగద్గురు, శ్రీ రేణుకాచార్యులిట్లు వ్యాఖ్యానించి యున్నారు.

శ్లో॥ బ్రహ్మేతి లింగమాఖ్యాతం- బ్రహ్మణస్పతిరీశ్వరః । పవిత్రంతద్ధి విఖ్యాతం - తత్సంపర్కాత్తనుశ్శుచిః॥ ఇక్కడ బ్రహ్మమనగా లింగ మనియు, బ్రహ్మకు ప్రభువు ఈశ్వరుడనియు, ఆకారణముచేత ఆ లింగమతి పవిత్రమైనది. దానిని యెల్లప్పుడు దేహమునందు ధరించుట వలన అట్టి శరీరము పవిత్రమైనదనియాదేశించి యున్నారు.

శ్లో॥ "లింగాంగ సంగినాంచైవ పునర్జన్మ నవిద్యతే" అనియు (లింగ-స్కాంద కూర్మపురాములలో ప్రమాణములున్నవి.)

శ్లో॥ వయంబ్రహ్మాదయః సర్వే-పశవః పరికీర్తితాః ।
త్వమస్మాకం పశుర్జ్ఞాత్వా-తస్మాత్వంశుపతి శ్శివః ॥

ఋ॥ "అయంమే హస్తో భగవాన్, అయం భగత్తరః । అయంమె విశ్వభేష జ్ఞోఽయం శివాభిమర్శనః॥ అయంమాతాఽయం పితా, అయంజీవాతు రాగమాత్। ఇదంతవ ప్రసర్పణం-సుబంధూ ఏహినిరీహి॥

(ఋగ్వేదము, ౮-౧-౨౩)

తా॥ అయం భగవాన్ ఈ లింగరూపుడైన సదాశివుడు, మే హస్తం=నా యొక్క కరగతమై యున్నాడు. అయం=ఈ శివలింగమూర్తే, మె నాకు, భగవత్తరః=అధికమైన ఐశ్వర్యమునొసఁగును. అయం నాచేతనున్న ఈ శివలింగమూర్తి మే=నాకు, విశ్వభేషజః=భవ రోగనివారణమునకు వైద్యుడుగా నున్నాడు. అయం=నా హస్తమం దున్న ఈ లింగమూర్తి, మాతా=తల్లివలె ప్రేమముగల వాడై యున్నాడు. పితా=తండ్రివలె రక్షించును, అయం=ఈ శివలింగ మూర్తి, జీవాతుః=సంజీవినివలె ప్రాణములను గాపాడును, ఆగ మాత్=శాస్త్రప్రమాణముతో, హేసుబంధో? ఓయీ॥ నిర్వ్యాజబంధు వైనవాడా ? ఏహి=ఇటకురమ్మ, ఇదం=నాహస్త మందున్న ఈ శివలింగమును, నిరీహి=అటునిటు కదలకుండునట్లుగా నీ యిష్ట లింగము నందె యెల్లప్పుడు నెలకొని యుండుమని తాత్పర్యము"

యః॥ "యాతేరుద్ర శివాతనూరఘోరాఽపాపకాశినీ ।
తయానస్తనువా శంతమయాగిరి శంతాభి చాకశీహి॥

తా॥ భోరుద్ర!=ఓయీ పరమేశ్వరా! తే=నీయొక్క అపాపకాశిని=మనో వాక్కాయ కర్మలలో బుట్టిన బహు విధములైన పాపాంగములను

ప్రకాశింపక సంహారము చేయుచుండిన, అఘోర=భయంకరమై నదిగాక ప్రశాంతమైన రూపముగల యాతనూః=ఏశరీరముగలదో

"లింగంతు శివయోర్దేహస్తాభ్యాం యస్మాదధిష్ఠితః" అని వాయవీయ సంహితా వాక్యము గలదు. ఏదోఒక ఇష్ట ప్రాణభావ లింగరూపమైన దేహము శివా=మంగళకరమైనదో, శంతమయా=భక్తులకు మహాభోగ మోక్షరూపమైన సుఖము ననుగ్రహించుటకై అత్యంత సుఖస్వరూపమైన, తయాతనువా=ఆ ఇష్టప్రాణలింగ రూపమగు శరీరములో, బోగిరిశంత= ఓయీపరమేశ్వరా ! త్వం=నీవు నః=మాకు "ఇషమూర్జం తపసాను యచ్ఛతే, ప్రాణేష్వంతర్మనసోలింగమాహుః" అను నర్థము శిరోమంత్రమై యొప్పు చుండగా, ఇష్ట + లింగ = ప్రాణలింగ-మేకంకృత్వార్చనం పరం, అని వాతు లోత్తర తంత్రము మొదలగు దేశికోత్తములైన మమ్ములను గురించి, అభిచాకశీహి=అభిముఖుడవై ప్రకాశించుము అని వ్యాఖ్యానించి యున్నారు. ఆ కారణముచేత యజుర్వేదముగూడ లింగధారణమునే సమర్థించుచున్నది.

శ్లో॥ ఓం నమోలింగరూపాయ-జగజ్జన్మాదిహేతవే ।
నిగమాగమ వేద్యాయ-భక్తసిద్ధి ప్రదాయినే ॥

( భాష్య కారికా ప్రమాణం)

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వ దయోదేవాః - సర్వేవేదాదయస్తథా ।
లీయంతే యత్రగమ్యంతే - తల్లింగం బ్రహ్మకేవలం ॥

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వదయోదేవాః - మునయో గౌతమాదయః ॥
ధారయంతి సదాలింగం - ఉత్తమాంగే విశేషతః ॥సి. శి. భా.॥

శ్లో|| ముఖేమంత్రో హృదిధ్యానం - మస్తకేలింగధారణం |
రుద్రాక్షంచ శిఖాభస్మ - ఇతి బ్రాహ్మణలక్షణం ||

తా|| ముఖమున (నోట) శివ పంచాక్షరీ మంత్రమునుచ్చరించుచు, హృదయములో శివధ్యానమును (స్మరించుచు) సిరస్సునందు ఇష్ట లింగమును దాల్చుట, నుదుట భస్మ పుండ్రములను ధరించుట, మస్తకమున శిఖ యుంచుట, కంఠమున రుద్రాక్షలను ధరించుట, వీనిని తప్పకుండ ధరించుట, బ్రాహ్మణుని లక్షణము అని గౌతమునిచే ప్రణీ తంబైన స్మృతిలోను లింగ ధారణమునే సమర్థించబడినది.

శ్లో|| లింగమధ్యే జగత్సర్వం - త్రైలోక్యం సచరాచరం |
లింగబాహ్యేత్పరంనాస్తి-తస్మాల్లింగం ప్రపూజయేత్|| (లింగమహత్మే)

( మూలగ్రంథే ప్రమాణం )

శ్లో|| ధార్యేషూత్తమమేవ భస్మమహతీ రుద్రాక్షమాలావళి |
జాప్యేష్వత్యధిక షడక్షరమహా మంత్రస్సమర్చేష్వపి |
శ్రేష్ఠంలింగ మహర్నిశం పరమిదం పేయేషు పాదోదకం |
శంభోస్సర్వమతో గృహీతమమలై భక్తైర్మనోజద్విషః |

( ప్రమాణం శంకర సంహితె )

శ్లో|| తత్పదేనోచ్చతెలింగం - త్వంపదేనాంగమీరితం |
అనయోరైక్యభావోఽయం - సంబంధోఽసిపదేనచ |
ఏవంలింగాంగసంబంధ-భావనా యస్యనిద్యతె |
సయోగిసచసర్వజ్ఞ - స్సజీవన్ముక్తఉత్యతె ||

శ్లో|| శిష్యస్య ప్రాణమాదాయ - లింగేత్ర తన్నిధాపయేత్ |
తల్లింగంతస్యతు ప్రాణి - స్థాప్యయేదేకభావతః ||
ఏవంకృత్వాగురుర్లింగం, శిష్యహస్తే నిధాపయేత్ ||
(సి. శిఖామణి 6.23)

తా|| దీక్షాకాలమున గురువు శిష్యుని ప్రాణ (లింగ) మునే తన దృష్టి యోగ విభావముచేత నాకర్షించి, ఆతని కరస్థలమునకు దెచ్చి షడధ్వ పరిశుద్ధమైన పంచసూత్ర ఘటితమగు శివలింగమునందు ప్రతిష్ఠింపజేయును.

శ్లో|| లింగధారీసదాశుద్ధో - నిజలింగమనోహరం |
అర్చయేద్గంధపుష్పాద్యైః - కరపీఠేసమాహితః ||

తా|| లింగధారి సదాశుద్ధుడై గుర్వనుగ్రహించిన మనోహరమైన దనలింగమును దనవామ కరస్థలమునందుంచి బూజించనగును, ఈ ఇష్టలింగమును "అమృత" మని వేదములంగీకరించియున్నవి, అంతేగాకుండ దానిని భవబంధమునుండి విడువడుటకై యెల్లప్పుడు దన శరీరముపైననే ధరించవలెనని విధించియున్నవి.
"అమృతస్యదేహధారణోభూయాసం,, (తై. శి. ౪) అను మంత్రమునకు భాష్యమును ఆచార్యులవారు వివరించిరి, అమృత రూపమగు నీ ఇష్టలింగము భవరోగనివారణకు దివ్యౌషధము.

## -: లింగ యోగము :-

శ్లో|| ఋజుకాయోదృశంలింగే - విన్యస్యస్థిరమానసః |
స్మరన్ పంచాక్షరీంశాంతః - శివోభవతిహిధ్రువం ||

లింగాంగిలింగసత్ప్రాణి - లింగాత్మాలింగమానసః ।
లింగేంద్రియోలింగభోగీ - లింగయోగీసకధ్యతే ॥

( వీరశైవాచార ప్రదీపికె ప్రమాణం )

శ్లో॥ లింగేనసహపంచత్వం - లింగేనసహజీవితం ।
ఏతెధర్మాసుప్రతిష్ఠాః - శైలాదేనప్రతిష్ఠితాః ॥ స్కాం. పు ॥

శ్లో॥ జ్యోతిర్మయంపరంలింగం - శృతిరాహశివాత్మకం ।
తస్యభాసాసర్యమిదం - ప్రతిభాతినసంశయః ॥ (సి. శిఖామణి)

-: మరికొన్ని వేదప్రమాణములు :-

"నిధనపతయేనమః"

"సర్వలింగగ్ంస్థాపయతి, పాణిమంత్రంపవిత్రం"

"యశ్ఛందసామృషభోవిశ్వరూపః"

"నమోబ్రహ్మణే ధారణంమే"

"వేదాంతోపనిషత్తు" - అథాశ్వలాయనోభవంతం"

"భక్తియోగోపనిషత్తు" - అధపరమశివలింగాంగ సామరస్యభక్తియోగః"

నిర్ణేపోపనిషత్తు-"భస్మాలేపః సర్వగాత్రేషునిత్యం
రుద్రాణాంధారణంలింగ పూజా"

చిదంబరోపనిషత్తు - కోటిజన్మార్జితైః పుణ్యైః శివే
భక్తిర్జాయతెపుణ్యశేషాత్"

సిద్ధాంతశిఖోపనిషత్తు - సద్యోజాతాద్బ్రహ్మాణాః సంబభూవుః ।

లింగధారణోపనిషత్తు - చతుర్వర్ణానాంధారణంకుర్యాత్"

ప్రసాదజాబాలోపనిషత్తు - రుద్రభుక్తంభుంజీథ
రుద్రపీతం పిబేత నారుద్రోరుద్రమర్చయేత్"

వీరలైంగ్యోపనిషత్తు - ఆత్మలింగంయోధత్తేసోఽహమేవ"

మున్నగునవేగాకుండ ఈశావాశ్యాది దశోపనిషత్తులందును వీరశైవ సిద్ధాంత విషయము ఉల్లేఖింపఁబడినది, (చెప్పబడినది) ఈ ఉపనిషత్తులకు దూర్వాస, కాళహస్తి, దీక్షిత, వృషభ, పండితారాధ్య, మొదలగు ననేక జన ప్రాచీనాచార్యులు వీరశైవ సిద్ధాంతపరముగా భాష్యములను రచించిరి, ఇంతవరకు వేదోపనిషత్తుల యొక్క ఆధారముల నుట్టంకించబడినవి.

-: ఇఁకపైన ఆగమశాస్త్ర ప్రమాణములు :-

సూ. ఆ:- ఏకకాలం ద్వికాలంవా - త్రికాలంవాఽపి శాంకరి ।
పూజయేన్నియతంలింగం - ప్రాణలింగపరాయణః ।
ఏవంయః కురుతేభక్త్యా - ప్రాణలింగార్చనంసదా ।
వీరశైవః సవిజ్ఞేయః సర్వశైవోత్తమోత్తమః ॥ పంచమ పటలః ॥

వాతూల ఆ. మూర్ధ్నికంఠే భుజేహస్తే - హృత్స్థలేనాభి మండలే ।
ఏతేషామేకదేశేతు - ధారయేచ్ఛివలింగకం ॥ దశమ పటలః ॥

పారమేశ్వర ఆగమ "నవీరశైవసదృశం - మతమస్తిజగత్రయె ।
సర్వభోగప్రదంపుణ్యం - శివసాయుజ్యదాయకం" ॥

యస్యభస్మలలాటేఽస్తి - కంఠేలింగమహాత్మ్యకం |
రుద్రాక్షధారణందేహే - సోఽహందేవీనసంశయః ||
ప్రథమ పటలః ||

వీరాగమే :- గురోశ్చజంగమశ్చైవ - శివలింగస్యపూజనం |
ఏషాంపాదోదకంచైవ - భుక్తశేషాన్నమేవచ |
భక్షయేచ్చివభక్తిస్తు - ప్రాసాదోజన్మశుద్ధిదః ||

వీరాగమే శ్లో|| లింగాధీనం జగత్సర్వం - లింగంబ్రహ్మాండమేవచ |
తల్లింగం జంగమాధీనం - జంగమోమమదేవతా ||

శ్లో|| అంగమాశ్రిత్య ఆచారం - తదంగంప్రాణమాశ్రితం |
తత్ప్రాణ మాశ్రితంలింగం - తల్లింగంజంగమాశ్రితం ||
( గరుడ పురాణము )

ఇవే మున్నగు సమస్త శివాగమములందు లింగధారణ పూర్వకమైన వీరశైవ ధర్మము విషయమై చాల విస్తారముగా ప్రతిపాదించబడినది. వీరశైవ ధర్మకర్మాది విషయములు శివాగమములందు విస్తారముగా వివరింపఁబడినట్లు మరి యే ఇతరగ్రంథములందుల్లేఖింపఁబడలేదు. ఇఁక పురాణములందు వీరశైవ ధర్మ విషయము ఏ విధముగా ప్రతిపాదింపఁబడినదో బరిశీలింతము.

శివపురాణం "వాయవీయసంహితె" :-

"పురతః కల్పితేఽవాత - మండలే వర్ణమండితె |
స్థాపయేత్ పంచకలశాన్ - దిక్షుమధ్యేచదేశికః ||

శివపురాణె :-

,, విద్యేశ్వరసంహితె "శివభక్తోవసేన్నిత్యం - శివలింగం సమాశ్రితః | స్థాణుర్లింగాశ్రయేనైవ - స్థాణుర్భవతిభూసురాః | పూజయేచ్చర లింగస్య క్రమాన్ముక్తోభవేద్ధ్రువం ॥ (అధ్యాయము 16)

శివభక్తుడెప్పుడు శివలింగమును తన దేహమునందు ధరించియే యుండదగుననియు సదా శివలింగమును ధరించుట చేతనే, ప్రత్యక్షముగా శివుఁడేయగుచున్నాడను భావనచేత చర (జంగమ) లింగమునారాధించుట వలన మోక్షము లభించునని భావము, పై శ్లోకమునందు గలదు, (వీరాగమము 4వ, పుట యందు గలదు.)

శైవపురాణే ప్రమాణం

శ్లో|| యదాయదాహిధర్మస్య - హానిర్భవతి భూతలే |
తదాతదావతారోఽయం - గణేశానాంమహీతలే ॥

తా॥ ఏయేకాలములో భూమండలమున ధర్మము క్షీణించుచున్నదో ఆయా కాలములందు శివధర్మ సంస్థాపనము కొరకు ప్రమథగణము మర్త్య లోకమునందవతరించి ధర్మ సంస్థాపన జేయుదురని పరమేశ్వరుడే "వీరాగమము"లో నాజ్ఞాపించి యున్నాడు.

శివ పు :- సనత్కుమారసంహితే :-

"గృహిణోలింగినోవాపి - మద్భక్తామత్పరాయణాః |
మత్ప్రసాదాగమిష్యంతి - మోక్షం పరమదుర్లభం ॥

స్కంద పు : కేదారఖండేయధోక్తాః శివధర్మాహినందినా పరికీర్తితాః ॥౪౦॥
శైలాదేనమహాభాగా | విచిత్రాలింగధారణః

దేహస్యోపరిలింగంతు । ధార్యతేహి పురాతనైః ॥ ౪౧ ॥
లింగేన సహపంచత్వం । లింగేన సహజీవితం ।
ఏతేధర్మాః సుప్రతిష్ఠాః - శైలాదేన మహాత్మనా ॥౪౨॥అధ్యా౬॥

శైవ పురాణె : నానాయోనిసహస్రేషు - భూత్వాసంఖ్యాతిజాతిషు ।
అంత్యజాతి శతంశూద్రో - శూద్రోవా పంచవింశతిః ।
తద్వైశ్యోషోడశోరాజా - తద్రాజన్నవమంద్విజః ।
తద్విజాష్టమభక్తానాం - తద్భక్తస్త్రీణి జంగమం ।
జంగమం రుద్రరూపత్వం - పునర్జన్మ నవిద్యతె ॥

–: వైష్ణవ పురాణము :–

శ్లో॥ బ్రాహ్మణస్తు సదాచారి - పూర్వజన్మని వైష్ణవః ।
తత్రవిష్ణు ప్రసాదేన - జాయతే శూలిపూజకః ।
దశజన్మ శివార్చేన - జాయతే వీరశైవినః ।
వీరశైవ పునర్జన్మ - జాయతే చరలింగకం ।
చరలింగమనాయోగాత్ - పునర్జన్మ నవిద్యతే ॥

ఈ విధముగా ఆగమము వేదోపనిషత్తులలో లింగధారణాత్మకమగు మహాపాశుపతసిద్ధాంతము ప్రతిపాదితమైయున్నది. వీరశైవ సిద్ధాంత గ్రంధములైన "లింగధారణ చంద్రిక" శ్రీకర భాష్యము "క్రియాసారము" "సిద్ధాంత శిఖామణి" మరియు కామికాది వాతులాంతమైన (28) ఇరువది యెనమిది శైవాగమములు, శివాద్వైతమంజరి, స్కందాది పురాణములలో ఈ వీరశైవ సిద్ధాంత విచారము ప్రతిపాదితమైయుండుటేగాకుండ పంచాచార్యుల సుస్పష్టములైన వర్ణనములే ప్రమాణములుగా నున్నవి.

వేదవ్యాస విరచితమగు, కాశీఖండము యొక్క 95వ అధ్యాయములో ఘంటాకర్ణ వ్యాసేశ్వర లింగముయొక్క ఉల్లేఖనముగలదు. స్కంద పురాణాంతర్గతమైనకేదార ఖండమున ఘంటాకర్ణముని మరియు దారుక తీర్థ భగవత్పాదుల ఉల్లేఖనములు, కాశిఖండముయొక్క (70)వ, అధ్యాయములో మరియు (క్రీ. శ. ౧౦౩౦,లో నున్న) క్షేమేంద్ర విరచితమగు భారత మంజరులందు రుద్ర తీర్థము, స్కందతీర్థము, రేణుకాది తీర్థముల పేరులున్నవి. శంఖుకర్ణేశ్వర (మహాభారత వనపర్వము అ. ౮౨-౩౦) అసంఖ్యాతా (సంచరంతి) భవిష్యంతి (భిక్షకో=భిక్షవో) లింగినస్తథా, భారత శాంతి పర్వము అ. ౬౪-౬౫ అని లింగధారులను గురించిన యుల్లేఖనములున్నవి. అనుశాసన పర్వము ౨౨వ, అధ్యాయములో.

శ్లో|| "బ్రాహ్మణం లింగినంచైవ - బ్రాహ్మణంచాప్య లింగినం" |

అనియు సౌరపురాణము (పూనా ఆనందాశ్రమము యొక్క ప్రకటన 35 వ, అధ్యాయము)లో నున్న శంఖుకర్ణ, గోకర్ణులను ద్వాపారములోని ఆచార్యుల వారి వర్ణనలున్నవి. మరియు రేణుక, దారుక, ఘంటాకర్ణ, శంఖుకర్ణ, మున్నగువారి అస్తిత్వమును చాటుచున్న ఆగమ ప్రమాణములు ప్రసిద్ధమైనవి.

అథర్వణ వేదము సృష్టికంటె మొదలే (ఆదిలోనే) వీరశైవ ధర్మముండినదని యాదేశించినది.

ఋగ్వేదము (౯-౪౩-౮)లో ప్రమథులే లింగధారులకు మూల పురుషులని నిర్దేశించిన దానిని మెగడ్నాగల్ అను ప్రసిద్ధ ఇతిహాసజ్ఞులు "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం" అను గ్రంథము ౪౩వ, పుటలో చెప్పియున్నారు. మరియు వైదిక వాఙ్మయ చరిత్ర ౧౩౨వ. పుటలో, ఋగ్వేదమునందు

శివుని యెల్లప్పుడు ఎదపై ధరించియున్నవారు రుద్ర పుత్రుల సంతతి వారే (లింగధారులే) ఈ ప్రపంచమునకంటె పూర్వమునందున్న వారని చెప్పఁబడినది.

ఇఁక వచన శాస్త్రాధారములు గూడ నాలుగు యుగములందలి విషయము చర్చనీయము.

## కృతయుగము - స్కాంద పురాణము

## అరుణాచల ఖండము

మహిషాసురుఁడు లింగధారియగుట వలన దేవికి యాతనిని సంహరించుటకు చాల ప్రయాసమయ్యెను. చివరి కాతని కంఠము నందలి లింగమును దీసికొని సిరచ్ఛేదనము గావించెను. అప్పుడాలింగము దేవి యొక్క ఎడమ చేతికట్లే అంటికొనినది, అట్టి లింగము తనచేత నుండి వీడుటకు పరిహారమేమిగలదని దేవి శివుని బ్రశ్నించగా, అగస్త్యమునీశ్వరునిచేత శివ భక్తుల చరిత్రను వినినచో ఆ లింగము దేవి హస్తమును వదలిసదని స్కాంద పురాణం అరుణాచల ఖండమునందు జెప్పఁబడినది. దీనివలన కృతాయుగములో శివభక్తులు (వీరశైవులు) ఉండిరని నిస్సందేహముగ దెలియు చున్నది.

అగస్త్య మహర్షి జగద్గురు శ్రీ రేణుకాచార్య భగవత్పాదుల నుండి శివదీక్షా సంస్కారమును బడసి ఇష్టలింగధారియై వీరశైవ తత్త్వములను దెలిసి కొనుట వలననే దేవికి వీరశైవుల (శివ భక్తుల) చరిత్రను బోధించి యున్నారు.

శ్రీ రేణుకాచార్యుల వారికి కృత, త్రేతాయుగములందు భిన్న భిన్న నామములున్నప్పటికిని రేణుకాచార్యులనియె ప్రసిద్ధిగాంచిరి.

ఈ విషయము అగస్త్యమహర్షికి జగద్గురు శ్రీ రేణుకాచార్యుల వారనుగ్రహించిన సిద్ధాంత శిఖామణియందు గలదు.

శ్లో॥ విష్ణుబ్రహ్మేదయోదేవా — మునయోగౌతమాదయః ।
ధారయంతి సదాలింగం — ఉత్తమాంగే విశేషతః ॥

గౌతమముని కృతయుగములోనివాఁడు. వీరి వలననె గోదావరి నది పుట్టుక, దధీచి, దూర్వాసాదులు కృతయుగము వారు.

## -: బసవేశ్వర వచనములు :-

కృతయుగమున కేదారమను మూలస్థానము, త్రేతాయుగమున, వారణాసియను మూలస్థానము, ద్వాపరయుగమున విరూపాక్షుడను మూల స్థానము, కలియుగమున పర్వతమను మూలస్థానము, ఈ నాలుగు మూల స్థానములు నానాస్థానములఁదిరిగితిని, జంగమే లింగమని విశ్వసించితిని, కూడల సంగమదేవా ॥

కేదారము-కాశి-శ్రీశైలము ఈ మూఁడు స్థానములందు వీరశైవుల పీఠములే యున్నవి. వీరు పంపాక్షేత్రములందు (హంపి) ను గూడ పేర్కొన బడియున్నారు. పూర్వములోనున్నవిగూడ వీరశైవుల అధీనమునందే యుండ వచ్చును. వీరి తరువాత శతమానములోపున నున్న హరిహరాచార్యులు పంపా క్షేత్రమునందే యుండి రగడలను రచించినట్లు కూడల సంగమ క్షేత్రము బసవన్న గారికి ప్రధానమైన స్థానమువలే హరిహరాచార్యులకుగూడ (హంపి) పంపాక్షేత్రమే ముఖ్యమైన స్థానముగా నుండినది. మరియు రాఘవాంక కవులకు ప్రధాన స్థానమై యుండెడిది. మరియు వారి తరువాత శ్రీ చన్న బసవ పురాణకర్తయైన శ్రీ విరూపాక్ష పండితుఁడు తన ఉద్గ్రంథమగు

చన్నబసవ పురాణములో ప్రతి సంధి ప్రథమ పద్యమున పంపాపురీ ప్రభువైన విరూపాక్షదేవుఁడు రక్షించుగాత, అని స్తుతించుటను గమనించినచో ఒకానొక సమయమునందు హంపి క్షేత్రముగూడ వీరశైవుల క్షేత్రముగా వెలసియుండెడిదని దెలియుచున్నది. ఈ విషయములో పరిశోధించుట యత్యావశ్యకమైన కర్తవ్యము, మనందరిపై యున్నది. మరియు ప్రౌఢదేవరాయలవారి కాలముననను నూటొక్క మంది విరక్తుల కాలములోను ఇక్కడ ప్రభావితమైయున్నట్లు దోచుచున్నది. ఈ విచారమున చెన్నబసవన్న గారి విచారమే వేరుగానున్నది.

-: శ్రీ చన్న బసవేశ్వర వచనములు :-

వచనము :- కృతాయుగమున, ఓంకారుడను సత్యస్వరూపుడగు దేవాంగ భక్తుఁడు, స్థూలకాయుఁడను జంగమము, నాటి ప్రథమ మూల స్థానము కేదారేశ్వరము.

త్రేతాయుగమున :- ఘంటాకర్ణుఁడను భక్తునేర్పుచునెడ, శూన్య కాయుఁడను జంగమము, నాడు ప్రథమ స్థానము రామేశ్వరము.

ద్వాపారయుగమున :- వృషభుడను భక్తునియేర్పరచునెడ అనిమిషుడను జంగమము, నాడు ప్రథమ మూలస్థానము సౌరాష్ట్రము.

కలియుగమున :- బసవడను భక్తుని జేయునెడ ప్రభువను జంగమము, నాటికి మూల స్థానము శ్రీశైలము,

ఇట్లే నాలుగు యుగములందును, నాలుగు జంగమ స్థలములు, నాలుగు యుగములందు నాలుగు లింగ స్థలములు, కూడల చెన్న సంగమ దేవా అనియుద్ఘోషించి యున్నారు.

కృతయుగపు ఎనుబది నాలుగు ఏబదియారు వేల సంవత్సరములలో కేదారేశ్వర దేవుడు పృధ్వికి మూలస్థానము.

త్రేతాయుగము పదియేడు లక్షల ఇరువదియెనమిది వేల సంవత్సరము లందు సేతుబంధరామేశ్వర దేవుడు పృథ్వికి మూలస్థానము. ద్వాపార యుగపు ఎనమిది లక్షల అరువదినాలుగువేల సంవత్సరములలో సౌరాష్ట్ర సోమేశ్వరుడు పృథ్వికి మూలస్థానము.

కలియుగము :- నాలుగు లక్షల ముప్పదిరెండు వేల సంవత్సరము లందు శ్రీ గిరి చెన్నమల్లికార్జున దేవుఁడు పృథ్వికి మూలస్థానము. అది మొదలుగొని నేటికి చివరిగా తప్పకుండ నాలుగు యుగములందును జంగమే ప్రాణలింగమైన కారణమున స్థావరము జంగమ ప్రసాదమునకు యోగ్యమయ్యెను.

పై వచనమును దిగువ వచనము బలపరచుచున్నది. మరియు కృతాయుగమున, త్రేతాయుగమున, ద్వాపారయుగమున, కలియుగమన నాలుగు యుగములలోను అట్టి గురు-లింగ-జంగమముల నిర్ణయమునవ ధరింపరయ్యా! మార్గ క్రియలయందు నయనుడి, నమస్కారము, భయ భక్తి, కరుణ కింకుర్వాణత, కర్తృ భృత్యత్వముయొక్క అనుభవమును "జంగమంబునకు అర్పితము జేసిన పిదప మిగిలిన ప్రసాదమునుపభోగించు టలో పదార్థమని భావించినట్లైతె ప్రసాదద్రోహమయ్యా! అట్టి జంగమంబు నందు 1. అస్థిరత్వబుద్ధి, 2. అనృతవాక్యము, 3. పంక్తిభేదము 4. ఉదాసీనత 5. నిర్దయత, ఇవియైదున్ను జంగమ ద్రోహమయ్యా! లింగము నందు ప్రేమ, స్నేహము మోహము విశ్వాసములేని యెడల ప్రేతలింగము సంస్కార భూత ప్రాణియనఁబడును. ఈ యైదును లింగద్రోమమయ్యా!

గురువునంద హంకారము, భయములేకుండుట, సమపంక్తిలో గూర్చుండుట సంభాషణ యొనర్చుట, చేతుల జోడించి యర్థించుట. ఇవి యైదును గురు ద్రోహమయ్యా ! ఈ కారణముచేత గురు-లింగ-జంగమంబులకు సకల పదార్థములఁ సమర్పించి ప్రసాదముగా భావించి మరల ఎంగిలియని భావించి హస్త, ప్రక్షాళనముగావించినచో అఘోరనరకమయ్యా ! కూడల చన్నసంగమదేవా,

ఈ వచనములో నాలుగు యుగములందును గురు-లింగ-జంగమంబు లున్నారనియు, భక్తులు వారిపట్ల యెట్లు నడచుకొనవలయునో అనుదానిని సుస్పష్ట పరచియున్నాడు. మరో వచనములోను.

ఇరువదియొకటి యుగములోని వారందరు లింగమునర్చించినదృష్ట మేది ? నష్టమేదియని దెలియక భావభ్రాంతికిలోనైరి, జీవసంకల్పితులైరి, ప్రాణమునర్పించుటే లింగార్పితమనియెదరు, సంసారతీగను త్రెంచనొల్లరు, వీరేనా భక్తులు ? వీరేనా ప్రసాదీకులు ? కాదు కాదుసుమా, చిత్తగించండి భక్తుని మహిమను ప్రసాదముయొక్క గొప్పదనమును, పృథ్వికి సంబంధించిన ప్రసాదమును లింగమునకు నివేదించని భాష, నీటితో లింగమునకభిషేకించని భాష, అగ్నితో లింగమునకు నీరాజనమెత్తని భాష, వాయువుతో గూడి పరిమళమును లింగమునకు నివేదించని భాష, ఆకాశమునబట్టిన శూన్యమును లింగమునకని భావించని భాష, అదెట్లనగా మరో పృథ్వీయుంటవలన, మరో నీరుంటవలన, మరో అగ్నిఉంటవలన, మరో వాయువుంటనలన, మరో ఆకాశముంటవలన, ఈ విధముగా ప్రత్యేకముగా నుంటచేత పదార్థ ద్రవ్యములను లింగమునకు అర్పించుటే భక్తి, ఈ కారణమున కూడల చన్న సంగయ్య కర్పించిన సుఖమును మీ శివశరణులే ఎరుగుదురు, మీరే ఎరుంగుదురు, నెనేమెరుగుదునయ్యా ! మీ యొక్క ధర్తము, మీ యొక్క ధర్మము.

ఇక్కడ పై వచనములో ఇరువది యొకటి యుగపు వారందరు, అని చెప్పియున్నారు. ఆ ఇరువదియొక్క యుగములను గురించి తెల్సికొన వలెనననిన "ఒకవైపు అది, అనాది, ఆనంత, అర్బుద, తమంద, తండజ, వారిజ, భిన్నయుక్త, ఆయుక్త, మునిరణ, మాన్యరణ, విశ్వావసు, అలంకృత, కృత, త్రేతా, ద్వాపార, కలియుగ, ములను పేర్కొనబడినది. ఇవి పదియేడున్నవి, ఇంకను నాలుగు ఎక్కడున్నవి ?

ఈ విషయమై చన్న బసవన్నగారి మరో వచనమును చూడుడు. ఎనమిదిలక్షల ఒక్కవేయి రెండు వందల దేవుళ్ళకు జేసిన అన్నము ఒక్క జంగముండారగింపను. ఒక్కలక్ష అరువదివేల రెండు వందల దేవుళ్ళకల్సి ఒక్క జంగమంబున కొనర్చిన అన్నమును ఆరగించుటకు సమర్థులుకావు. ఆ కారణమున అంతటి దేవుళ్ళకంటెను జంగమదేవుడే సమర్థుడు (గొప్పవాడు) చూడుమా ! కృతయుగమున సువర్ణలింగముగా మారిన పుడు నీనామధేయమేమి ? త్రేతాయుగమున రజతము (వెండి) లింగమైన ప్పుడు నీ నామదేయమెట్టిది ? ద్వాపారయుగమున తామ్రలింగముగా మారి నపుడు నీ నామధేయంబెట్టిది ? పదునెనమిది జాతులు, నూటావక్కటి కులముల చేతులలో చిలుమువదలినది, కలియుగములో శిలా లింగమైనప్పుడు ముందుంచిన అన్నము నారోగించదెందులకో ! వెనుకటి నాలుగు యుగము లందు నశించిపోవుటను గుర్తింపమి ఇంకనేలదేవుడని యాచరింతురో

సాక్షి : స్థావరం జంగమశ్చైవ - ద్వివిధం లింగముచ్యతే ।
జంగమస్యావమానేన - స్థావరం నిష్ఫలంభవేత్ ॥

స్థావరార్పితనైవేద్యం - నతృప్తిర్లింగముచ్యతే ।
జంగమార్పితనైవేద్యం - మమతృప్తి ర్మహేశ్వరీ ॥

అందువలన కూడల చన్న సంగమదేవయ్య, తప్పకుండ నాలుగు యుగములందును, జంగమమే ప్రాణలింగమగుటచేత స్థావరము కంటెను జంగమ ప్రసాదమె యోగ్యమయ్యెను, అని ఆగమ పమాణముచు ప్రమాణముగా జూపియున్నారు. మరియు

శృతి పురాణాగమ ఇతి హాసాదులవలన శివుడే యధికుడని యెరింగి సమస్త ఋషులు, దేవతలు, రత్నము, సువర్ణము, రజితము, తామ్రము, చంద్రకాంతము, స్పటికము, ప్రవాళాదినిర్మిత లింగముల నారాధించి అగస్త్యుడు - దధీచి, కణాదుడు, బాణాసురుడు, పురందరుడు, బ్రహ్మ, విష్ణు, దుర్వాసుడు, నందికేశ్వరుడు, స్కంద, భృంగిరిటుడు, వీరభద్రుడు ప్రమధాదిగుణులందరు శివుని బూజించి మహదైశ్వర్యయుక్త పదవులను బడసిరి. అదెట్లనగా

శ్లో|| (ఆదిత్యే) రుద్రేణదీక్షతో భగాత్వాస్కందః శివసమోభవేత్ ।
(శివాచార రహస్యే) "పాత్రతాంప్రథమంగతః" ॥

దీనిని గుర్తించి పరశురాముడు పారాశరుడు, వశిష్ఠ, వాల్మీకి కమలాకర, విశ్వామిత్రాది మహామునీశ్వరులెల్లరు శివలింగధారులై, శివ లింగార్చనలొనర్చి, జంగమ పాదతీర్థ ప్రసాదములను సేవించి ముక్తులైరి, అదియెట్లనగా శివధర్మే :-

శ్లో|| పాణినిశ్చ కణాదశ్చ - కపిలో గౌతమాదయః ।
ప్రసాదసేవనాధ్యానాద్ధారణాదర్చనాదపి ॥

ఆకారణముచేత కూడల చన్న సంగమదేవుని బూజించి, పాదోదక ప్రసాద ములను సేవించి, యత్యంతపునీతులైరి, సమస్త దేవతలు, సమస్త ఋషి పుంగవులు.

## ఇక ప్రభు దేవరవారి వచనములు

వచనము :- కృతయుగమునందు శ్రీ గురువు శిష్యుని గొట్టి బుద్ధి నేర్పించిన, కానిమ్ము మహాప్రసాదమని యంటినయ్యా ! త్రేతాయుగమున శ్రీ గురువు శిష్యుని తిట్టి బుద్ధినేర్పించినచో కానిమ్ము మహాప్రసాదమని యంటినయ్యా ! ద్వాపారయుగములో శ్రీ గురువు శిష్యునకు బెదరించి బుద్ధి నేర్పించినచో కానిమ్ము మహాప్రసాదమని యంటినయ్యా ! కలియుగము నందు శ్రీ గురువు శిష్యునకు నమస్కరించి బుద్ధినేర్పించినచో కానిమ్ము మహాప్రసాదమంటినయ్యా ! గుహేశ్వరా మీకాలము కట్టడి (నియమము)ని యభ్యసించిన దానికి నేను చకితుడనైతిని, ఈ విధముగా నాలుగు యుగము లందును శ్రీ గురువు శిష్యునకు బుద్ధినినేర్పు విచారము గమనించిన యెడల నాలుగు యుగములందును వీరశైవులుండిరనునది బలపడుచున్నది.

హరిశ్చంద్రకావ్యమునందు రాఘవాంకకవి హరిశ్చంద్రుని రాజ్యము నందు వీరశైవులుండిరనుటకు ఈ విధముగ వివరించియున్నాడు.

( హరిశ్చంద్రుని కాలము కృతాయుగము )

ఇంద్రుని సభలో హరిశ్చంద్రుని యసత్యమాడువానిగా జేయుదునని విశ్వామిత్రుడు బల్కిన వశిష్ఠుడు "శృతిమతకులాచార - లింగార్చనోన్నత తపం - తొరెదు తెంకణ ముఖవాగిహోహెం, హరిశ్చంద్రం మరెదు హుసియంనుడిదడె ॥ ౨-౨ సెవ. సంధి ॥

తా॥ "వేదసమ్మతమైన, కులాచారమైన, లింగారాధననుండి సంగ్రహించిన గొప్పతపస్సు యొక్క ఫలమును వదలి దక్షిణముఖముగాగ పయనింతు ననియు, హరిశ్చంద్రుడు మరచి యసత్యములాడిన అని భావము" అందుకు విశ్వామిత్రుడు

వచనము :- భక్తిశమెయోగ-లింగార్చనా । సక్తియింబెశెద పుణ్య ప్రొళర్ధమం సుధా । భక్తరరియలు కొడువెనా హరిశ్చంద్ర హాసియం నుడియదిరలెందను ॥ ౨౩ మరియు ౩వ, సందిలో "భూసురరు మంత్రాక్షతేయనెత్తు శివభక్తరా। సురది భసితమం కొట్టు-మత్తు-౪వ, సంధి, ముదహొశెద్దు శరీరధర్మమం చరిసి.........విదిత శివలింగపూజా సుఖమనెయ్దు .........మత్తు ౮. వ. సంధి. శివపూజెయం మాడదవను......... ॥౩౨-౧౧ వ. సంధి.........మునిమతో చిత శివార్చక నాదడె......... సత్యవెరసిద న్యాయవదు లింగార్చనె" ఈ విధముగా వీరశైవుల లక్షణమును గురించి నుడివి యున్నాడు. దీనివలన హరిశ్చంద్రుని రాజ్యములో వీరశైవులుండిరని దెలియుచున్నది.

దూర్వాస ఋషి కృతయుగములోనివాడు. ఆతని శాపమువలన దేవేంద్రుడు తన రాజ్యసంపద సముద్రము పాలుగాగ, అప్పుడు ఇంద్రుడు శివుని గురించి ప్రార్థింపగా, శివుడు మందర పర్వతమును కవ్వముగాజేసి, వాసుకిని త్రాడుగానొనర్చి, సముద్రమును మథించండి. నీ సంపద మరల లభించును, అని యాదేశించును. అప్పుడు దేవాసురులు కలిసి సముద్ర మథనము చేసినట్లు శివాజ్ఞ మేరకు విష్ణువు కూర్మావతారమును ధరించి మందర పర్వతము సముద్రమున మునగకుండ యెత్తి యుంచెను. (మత్స్య-కూర్మ-వరాహ-నారసింహ ఈ అవతారములు కృతయుగమునకు చెందినవి.)

-: త్రేతాయుగము :-

త్రేతాయుగములోను వీరశైవులుండిరనుటకు బలమైన ప్రమాణములున్నవి.

శ్రీ మహావిష్ణువు ఎత్తిన దశావతారములలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహము - మొట్టమొదటి ఈ నాలుగు అవతారములు కృత యుగము నందే యుండినవి.

త్రేతాయుగమున వామన, పరశురామ, శ్రీరామ ఈ మూడవ తారములుండినవి.

ద్వాపరమున శ్రీకృష్ణ, బౌద్ధ, ఈ రెండు, కలియుగమున కల్కి ఒక్క అవతారము మాత్రమే జరిగినది.

## కూడల సంగమక్షేత్రము యొక్క మహత్వము

త్రేతాయుగములో పరశురాముడు పరమశివభక్తుడు. ఇష్టలింగ పూజానిరతుడు. అతడు కృష్ణానదిలో స్నానమొనరించి, ఆ నదియందే ఒక రాతిగుండుపై యుపవిష్టుఁడై లింగ పూజను చేయు సమయమున తన చేతిలోని ఇష్టలింగముజారి అమృతేశ్వరమను సరోవరములోపడి మునిగెను. ఆ కారణమున ఆ చెరువునకు పరశురామ కాసారమను పేరు ప్రసిద్ధి యయ్యెను.

కూడల (కప్పడి) సంగమక్షేత్రము అనాదికాలము నుండియు ప్రఖ్యాతి గాంచినదని పురాణములాదేశించున్నవి. ఈ క్షేత్రమునకు

కృతయుగమున : భాస్కరక్షేత్రమనియు, ఈశ్వరునకు అమృతేశ్వరుడనియు,

త్రేతాయుగమున : పరశురామక్షేత్రమనియు, ఈశ్వరునకు యజ్ఞేశ్వరుడనియు,

ద్వాపరయుగమున : కపిలాక్షేత్రమనియు, ఈశ్వరునికి సిద్దేశ్వరుడనియు,

కలియుగమున : కూడలసంగమక్షేత్రమనియు, ఈశ్వరునకు సంగమేశ్వరుడనియు,

పేళ్లతో ప్రసిద్ధిగాంచెను. యుగయుగాల్లోను దేవతలవతరించి. యా లింగముల నారాధించి తరించిరి. (తమ అవతారముల ముగించిరి)

## -: పద్మ పురాణము :-

రావణుడు సీతను ఎత్తుకొని పోయిన తరువాత శ్రీరామచంద్రుడు దిగ్భ్రాంతుడై అరణ్యములో సంచరించు సమయమున అక్కడకు అగస్త్య మహర్షి విచ్చేసి, రామచంద్రా ! రావణుడు సామాన్యుఁడుగాడు. అప్రతి హత పరాక్రమము గలవాడు. ఆతనిని జయించుట అంత సులభమైన పనిగాదు. అందుచేత నీవు తపంబాచరించి శివుని ప్రసన్నునిగా నొనర్చుకొని, పాశుపతాస్త్రమును పొందిననే సాధ్యపడును, అనిచెప్పగా, దానికి శ్రీరామ చంద్రుడు అంగీకరించి, శివుని ప్రత్యక్షమొనర్చుకొను మార్గమెట్టిదో తెల్పుమని యడుగగా. అప్పుడు అగస్త్యమహర్షి రామచంద్రునకు విరజా దీక్ష యొసగి శివపంచాక్షరీ మంత్రమునుపదేశించి పంపగా, రామచంద్రుడు రామగిరియందు శివలింగమునర్చించి ఘోరతపంబు చేయగా. రాముని భక్తిభావమునకుఁ బ్రసన్నుండై విజయప్రదమగు పాశుపతాస్త్రమును అనుగ్రహించెను, అప్పుడు రామచంద్రుఁడు ఓ శివా ! నీ విశ్వరూపమును జూపి నన్ను కృతార్థునిగాఁ జేయవలెనని ప్రార్థింపగా శివుడు దన విశ్వ రూపమును ప్రదర్శించెను. ఆ విశ్వరూపమును చూడశక్యముగాక రాముడు భయగ్రస్తుఁడై మరల ప్రార్థింపగా సౌమ్యరూపమును బ్రదర్శించెను. అప్పుడు మోక్షమును బడయుట కర్హులెవరు ? కానివారెవ్వరు ? అని ప్రశ్నింపగా శివుడిట్లా దేశించెను.

శ్లో॥ అజ్ఞోపహాస భక్తాశ్చ - భూతి రుద్రాక్షధారిణః ।
లింగినోయశ్చవాద్వేష్టి - తేనైవాఽ త్రాధికారిణః ॥౪౫॥
( వ్యాసోక్త పద్మపురాణాంతర్గత, శివగీత ౧౬వ అధ్య )

తా॥ అజ్ఞాని, అపహాస్యము చేయువాడు. విభూతి రుద్రాక్ష లింగధారులైన శివభక్తులను ద్వేషించువారు మోక్షమును బడయుటకు అర్హులుగారు.

మఱియు

శ్లో॥ ప్రతిమా శివలింగంవా - దేవ్యైరేతః కృతంతుయత్ ।
తత్రతమాం పూజయేత్తేషు - ఫలం కోటి గుణోత్తరమ్ ॥

తా॥ ఎవరైతే భక్తితో శివలింగాన్ని పూజిస్తారో, వారేముక్తిని బడయుట కర్హులు.

మరియు :- రేణుక విజయ మహాపురాణము :-

జగద్గురు శ్రీ రేణుకాచార్య భగవత్పాదులు రావణుని తమ్ముడైన విభీషణుని ప్రార్థనమేరకు లంకలో ఒకే ముహూర్తములో మూడుకోట్ల లింగములను ప్రతిష్ఠించిరి.

మరియు :- స్కంద పురాణము :-

హనుమంతుని ప్రార్థనమేరకు శ్రీ వీరభద్రుడు "ఆంజనేయునకు ఇష్టలింగ ధారణమును గావించి అనుగ్రహించెను.

## -: ద్వాపర యుగము :-

శ్రీశైల సూర్యసింహాసనాధీశులైన జగద్గురు శ్రీ సదానంద లింగ శివాచార్య భగవత్పాదులు గారిని గూర్చి శ్రీ వేదవ్యాసమహర్షి స్కంద

పురాణము శంకర సంహితలో అధ్యాయము 85 నందు ఈ విధముగా నున్నది.

శ్లో|| తస్మింఛ్ఛ్రీ (తస్మిన్ శ్రీ) పర్వతేపుణ్యే, సంసారామయభేషజే ।
ఆస్తే లింగాంగ సంబంధీ, సదానందాహ్వయోమునిః ॥ 91

శ్లో|| సర్వోపనిషదర్థజ్ఞః - శివధ్యాన పరాయణః ।
భస్మావలిప్తసర్వాంగో - రుద్రాధ్యాయ జపాశ్రయః ॥ 92

శ్లో|| రుద్రాక్షమాలాభరణో - ధృతపాశుపత వ్రతః ।
అతివర్ణాశ్రమీయోగి - జీవన్ముక్తో జగద్గురుః ॥ 93

శ్లో|| తం సదానంద నామానం - శంకరధ్యాన లాలసం ।
నిరస్తకుహకం విప్రం - సహపుత్రేణ పూజయ ॥ 94

శ్లో|| తస్యప్రసాదత్వే - పుత్రోగచ్ఛేన్నీరోగతాం ధృవం ।
తస్మాదుత్తిష్ఠ గచ్ఛత్వం - శ్రీ పర్వతమతంద్రితః ॥ 95

తాత్పర్యము :- శ్రీశైల సూర్య సింహాసనాధీశ్వరులైన శ్రీ సదానంద శివాచార్యులవారు, సంసారరోగమును బారదోలుదురు. పరమపవిత్రులు, భస్మరుద్రాక్షధారులు, శ్రీ రుద్రాధ్యాయ, జపాసక్తులు, (సంసార రోగ నాశకులు) జీవన్ముక్తులు, జగద్గురువులు, శ్రీశైల క్షేత్రమందున్నారు. వారిని పూజించినట్లయితే వారి యనుగ్రహమువలన నీ కుమారుడైన పింగళుడు రోగ విముక్తుడగును. నీవు తత్‌క్షణమే శ్రీశైల క్షేత్రమునకు వెళ్ళుమని హరప్రియుడు శ్వేతునకు జెప్పినట్లు వేదవ్యాస మహర్షి స్కంద మహాపురాణము యొక్క శంకర సంహిత యందలి అధ్యాయము 85వ, శ్లోకము 90 నుండి 95వ, శ్లోకము వరకు వివరించియున్నాడు.

ఘంటాకర్ణ శివాచార్యులు (హిమవత్కేదారము యొక్క పీఠము జగద్గురువులు) హిమవత్కేదారము నందలి తాము వైరాగ్య సింహాసనాధీశులైనప్పుడు ఆ మహాచార్యుల వారి ఆశ్రమములో జ్ఞాన సంపాదన కొరకు అనేక మంది మహర్షులు నివసించి యుండిరను విషయము స్కంద పురాణము కేదార ఖండములో ప్రతిపాదింపఁబడినది.

కాశిలో ఉజ్జయిని సద్ధర్మ సింహాసనాధీశులైనవారి దారుకేశ్వర దేవాలయము, ఆ దేవాలయమునకు చేరువలోనే దారుకేశ్వర తీర్థము గలదు. ఈ దేవాలయము యొక్క తీర్థములు రెండును వేదవ్యాస మహర్షులవారు స్కంద మహాపురాణము, కాశీఖండములో 70వ అధ్యాయము 80-81వ శ్లోకములందు వర్ణించి యున్నారు. మరియు రేణుక-దారుక-ఘంటాకర్ణ-ధేనుకర్ణ-విశ్వకర్ణులను స్తుతించి యున్నారు.

శ్లో॥ యోహస్త పీఠేనిజలింగమిష్టం - విన్యస్యతల్లీనమనః ప్రచారః ।
బాహ్యక్రియా సంకుల నిస్పృహాత్మా-సంపూజయత్యంగ సవీరశైవః ।

అనియు-వీరశైవులు ఇష్టలింగమును తమ చేతిలో నిడుకొని బూజించుటను వేదవ్యాసమహర్షి గారు స్కంద మహాపురాణము శంకర సంహితయొక్క 84వ అధ్యాయము 36వ శ్లోకములో వర్ణించి యున్నారు.

శ్లో॥ శివభక్తో వసేన్నిత్యం - శివలింగం సమాశ్రితః ।
పూజయాచర లింగస్య - క్రమాన్ముక్తో భవేధ్రువమ్ ॥

తా॥ శివభక్తుడైనవాడు ఎల్లప్పుడు తన దేహము పై శివలింగమును ధరించి యున్నను జంగమామూర్తి పూజవలననే మోక్షమును బొందగలడని శివ మహాపురాణముయొక్క విద్వేశ్వరసంహితలో 16వ అధ్యాయము 159వ శ్లోకమున జెప్పఁబడినది.

శ్లో॥ యస్తు మాహేశ్వరో విప్రో - జాతిమాత్రోపి యద్యపి ।
ఉత్తమః సర్వపాత్రాణాం - తస్మైదత్తం తదక్షయమ్ ॥

తా॥ వీరమహేశ్వర బ్రాహ్మణుడు (జంగమము) జాతిమాత్రము చేత జంగముడైయుండి విద్యావిహీనుండైనప్పటికిన్ని అతడే దానమును గ్రహించుటకు అర్హుడగుననియు, అతనికిచ్చిన దానమే అక్షయమైన దనియు, సౌరపురాణము యొక్క 10వ అధ్యాయము 12వ శ్లోకము నందు జెప్పఁబడినది.

శ్రీశైలమునకు సంబంధించినట్టి విషయము స్కంద పురాణము నందుక్తమై యుండుటచేత నా క్షేత్రము అతీవ ప్రాచీనమైనదనియు వ్యక్తమగు చున్నది. వ్యాసమహర్షి తన గురువగు శ్రీ ఘంటాకర్ణ శివాచార్యులతోబాటు నచట తపంబొనర్చినటుల అప్పుడే శ్రీశైల ఖండమును రచించి యుండినటుల అక్కడున్నట్టి ఘంటా మఠమే వ్యాసుని మఠమనియు ప్రతీతి యున్నది.

ద్వాపరయుగములో జన్మించిన వ్యాసమహర్షికి ఘంటాకర్ణ శివాచార్యులు లింగధారణమొనర్చి వీరశైవ ధర్మోపదేశము గావించి యున్నారు. వ్యాసులవారు శ్రీశైల క్షేత్రమునందే అనుగ్రహింపఁబడుటచేత నా సమయమున వారు నివసించియున్న స్థలమునకే ఘంటా మఠమని పేరుగలదు.

బాణాసురుని పుత్రిక అనిరుద్ధుని భార్యయైన ఉషాదేవి కేదార పీఠము యొక్క సంస్థాన మఠమును జీర్ణోద్ధారము గావించుట వలన నేటికిని యీ మఠము ఉషా మఠమని ప్రసిద్ధిఁజెంది యున్నది. అదే మఠమును రూఢియందు ఊఖీమఠమని ప్రతీతి యున్నది.

ఉపమన్యుముని శ్రీకృష్ణునకు శివదీక్షననుగ్రహించి ఇంద్రనీల లింగమును ధరింపజేసి వీరశైవ తత్త్వోపదేశమునర్చె ననియు బసవ పురాణము 54వ సంధి అరువదియవ పద్యమున వివరింపబడినది.

సంస్కృత మహాభారతము నందలి అనుశాసన పర్వము 22వ అధ్యాయము 1-2వ శ్లోకములలో ధర్మరాజు భీష్మని "దానమొసగుట లింగిబ్రాహ్మణులకా ? అథవా అలింగి బ్రాహ్మణులలో ఎవరికి దానము చేయుట యోగ్యమని యడిగినపుడు భీష్ముడు

శ్లో|| కిమాహుర్ భరతశ్రేష్ఠ - పాత్రం విప్రాసనాతనాః ।
బ్రాహ్మణం లింగినంచైవ - బ్రాహ్మణం వాప్య లింగినమ్ ॥

ఓయీ ! ధర్మరాజా ! తన ధర్మమునందు శ్రద్ధయున్నట్టి లింగి బ్రాహ్మణునకు దానమిచ్చుట యోగ్యమైనది. వారు లేని యెడల అలింగి బ్రాహ్మణునకు ఇచ్చుట యోగ్యమైనది అని నిరూపించెను.

శ్లో|| శంకు కర్ణేశ్వరందేవ - మర్చయిత్వాయుధిష్ఠిరః ।
అశ్వమేధాద్దశగుణం - ప్రవదంతి మనీషిణః ॥

అని మహాభారతములో 82వ అధ్యాయమున 70వ శ్లోకమున ఆదేశించియున్నాడు.

ఓయీ ! ధర్మరాజా ! శంకుకర్ణేశ్వరుని బూజించినచో పదియశ్వమేధ యాగములను జేసినంత ఫలము లభించును. (శంకు కర్ణ శివాచార్యులవారు శ్రీశైల పీఠాధిపతులు) వ్యాసుడు సౌరపురాణమున 35వ అధ్యాయము 26వ శ్లోకమునందు "జంగమ శ్శంకుకర్ణశ్చ, గోకర్ణశ్చ, మహాబలః" అని వివరించి యున్నాడు.

శ్లో॥ రేణుకస్యచతత్రైవ - తీర్థం సిద్ధ సాధ్యాది ।
తత్రస్నాత్వాభవేద్విప్రో - నిర్మలశ్చంద్రమా యథా ॥

రేణుక తీర్థములో స్నానము చేయుట వలన పౌర్ణిమ చంద్రునివలే పరిశుభ్రుడగును. అని మహాభారతమున వన (అరణ్య) పర్వము 82వ అధ్యాయము 82వ శ్లోకమున జెప్పఁబడియున్నది.

"బ్రహ్మతుంగంచ కౌవనారం-రేణుకంచ సరోవరం" రేణుక సరోవరము పేరు ప్రసిద్ధి గాంచినది. ఈ రేణుక తీర్థము కేదారక్షేత్రములో వెలసియున్న ఉషామఠమునకు 2 రెండు మైళ్ళ దూరములో నున్నది.

స్కాంద పురాణము యొక్క శంకర సంహితలోను, మరియు లింగ పురాణము ఉత్తర భాగములోను, మఱియు సౌరపురాణము 10వ అధ్యాయము నందును, వీరశైవుల ఇష్ట లింగము విషయమై

1. ఆచార లింగము 2. గురు లింగము 3. శివ లింగము 4. జంగమ లింగము 5. ప్రసాద లింగము 6. మహా లింగము మున్నగు వాటి విషయమై వేదవ్యాస మహర్షులవారు బాగుగా ప్రతిపాదించి యున్నారు.

ప్రత్యక్షముగా ప్రమథులే లింగధారులకు మూల పురుషులని ఋగ్వేదము నందు చెప్పఁబడినది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము అను గ్రంథము నందును మఱియు వైదిక వాఙ్మయ చరిత్రయందును, శివుని యెల్లప్పుడు దేహముపై ధరించియున్న రుద్రపుత్రుల సంతతివారే (లింగధారులే) ఈ ప్రపంచమునకు మొదటి వారనియు ఋగ్వేదములో చెప్పఁబడినది.

పాండవులు అరణ్యవాసములో నున్నప్పుడు వ్యాస మునీశ్వరుని ప్రేరణమేరకు అర్జునుని హిమాలయ పర్వతమున ఇంద్రకీల పర్వతమునందు

పాశుపతాస్త్ర ప్రాప్తికై శివునిఁ గూర్చి తపంబాచరించు వేళ శివుడు అర్జునునికి కిరాతుని రూపమును బ్రదర్శించి యాతని భక్తి శ్రద్ధలనుఁ బరీక్షించుటకై వినోద యుద్ధమును జేయునప్పుడు, అర్జునుని ఓడింపగా నాతడు ఖిన్నుడై శివ (పార్థివ) లింగమును బూజించి ప్రార్థన జేయు సందర్భమున

ప॥ "ఆవ సువ్రత భంగవో, మేణావద్దైవ ద్రోహవో ।
తానావ శివభక్తారాధియో, పూర్వజన్మదలి ॥ అని వాపోయాడు. ఇటు కుమారవ్యాస కవి అర్జునుని ముఖము నుండి తానే శివభక్తున కపరాధ మొనర్చితినో, అని నుడివి యున్నాడు. శివభక్తులనగా నిట ప్రధానముగ వీరశైవులే

కన్నడ మహాభారతము అరణ్య పర్వము 6వ సంధి 38వ పద్యము.
వవమోహన తరంగిణి కావ్యము 18వ సంధి బాణాసుర చరిత్రము.

సూత్రం : పరమ సద్భక్తియిం గురువరాద్యర నొలిసి ।
వర వీరశైవదీక్షేయం పడెదు, తన్న శ్రీకర దిష్ట
లింగపూజాది మంత్రోపదేశవ పడెద బాణాఖ్యను ॥

సూక్తి : పరమ సద్భక్తియిం లింగార్చనంగైయ్యే ।
కరదిష్ట లింగ దొళ గీశ నిజదోరియద ।
కురితుయిష్టార్ధమంసలిసి శంకర పొగల సురేంద్ర

సుఖమర్దను 1 (19)వ సంధి దీనివలన బాణాసురుడు ఇష్టలింగ పూజకుడై యుండెనని గోచరించు చున్నది. అర్జునుని పుత్రుడు అభిమన్యుడు, అభిమన్యుని పుత్రుడు పరీక్షితుడు, ఆ పరీక్షన్మహారాజు

సూర్య గ్రహణ సమయమున కేదార పీఠ జగద్గురువులకు ఉభయము ఖీ గోవులను దానమొనర్చి యున్నాడనియు, ఆపరీక్షిత మహారాజు పుత్రుడగు జనమేజయ మహారాజు అదే కేదార పీఠాధీశులైన (తన కాలములోనున్న) ఆనందలింగ జంగమంబను పీఠాధిపతికి ౧౪౪ పల్లెలను (గ్రామము) దత్తతగా నొసగెననియు శాసనము గలదు. యుధిష్ఠిరుని శక (౮౯) ప్లవంగనామ సంవత్సరము మార్గశిర బహుళ 30 సోమవారం.

కృతాయుగము నందు నీవు స్కంధుడను గణేశుడవై యున్నది నేనెరుంగుదును. త్రేతాయుగములో నీవు నీల లోహితుండవను గణేశుడవై యున్న సంగతి నాకు దెల్సును. ద్వాపర యుగమున నీవు వృషభుడను గణేశుడవై యున్న సంగతి నాకు దెల్సును. కలియుగములో నీవు బసవడను గణేశుడవై సర్వాచార సంపన్నుడవై భక్తి జ్ఞాన [కందెర వెయమాడి] కనువిప్ప గావించి, శివా చారమును పెంపొందింపఁజేసి, శివభక్తియను పతాక నెగురవైచి, మర్త్యలోకము నందు వ్యాపింపఁజేసిన భేదమును భేదించి దిలకించి నేనెరింగితి, గుహేశ్వరుని సాక్షిగా మీ మహత్మ్యమునకు నమోనమో యనుచుంటినయ్యా సంగన బసవన్నా ॥

రామాయణ కాలమున రావణుడు గొప్ప శివభక్తుడుగానుండి, యాతడు ప్రాణలింగమును బడయుటకై ప్రయత్నించినట్లు; రాముడు రామేశ్వర లింగమును ప్రతిష్ఠించినట్లు ఆధారములున్నవి.

మహాభారతమున శ్రీకృష్ణుడు ఉపమన్యుమునీశ్వరునిచేత శివదీక్షను బొందినట్లును, మరియు నా మహాభారతమునందే లింగిబ్రాహ్మణ అలింగి బ్రాహ్మణ విషయముండుటను బరిశీలించిన త్రేతాయుగ ద్వాపరయుగము లందును వీరశైవులుండిరనియు దెలియుచున్నది.

డా॥ ఎస్. సి. నందీమఠ, ఎం.ఎ; పి.హెచ్.డి. [లండన్] వారి కృతి [రచన] కన్నడ నాడిన చరిత్ర నుండి దెలియుచున్నది.

ఇట్లు రామాయణ మహాభారత కాలములందును లింగాంగులున్నట్లు ఆధారములున్నవి.

పూర్వ కాలీన చరిత్రలోని విషయములన్నియు అంధకారమయమై యుండుట వలన సింధునదీ తీరములోని నాగరిక కాలము నుండి మహాభారత కాలమువరకు ఏమత విషయమును గురించి తెలియదు. అవుతే పూర్వ కాలములోను ప్రస్తుత కాలములోను, లింగధారణ. లింగపూజ నాటి నుండి నేటివరకు చైతన్య వంతముగా నుండి లింగార్చన మరియు లింగధారణాదులు ఆ మధ్య కాలము వరకు ప్రచలితమై యున్నదనుటే సరియైన సిద్ధాంతము. T. N. మల్లప్ప [రిటైర్డ్ జడ్జి బెంగుళూరు] గారు వీరశైవ త్రైమాసిక సంపుటి [4వ సంచిక 1, ఏప్రిల్-మే-జూన్ 1963]ని పరిశీలించి చూడుము.

## కలియుగ వీరశైవ చరిత్ర - పీఠిక

మానవుని బుద్ధి ప్రామాణికతతో గూడిన అనుభవము యొక్క సాత్విక నివేదికకు చరిత్రయని పేరు. అథవా మానవుని వాస్తవికతను [సత్యమును] దెల్పునది చరిత్ర. ఇంగ్లండులోని సుప్రసిద్ధుడైన చరిత్ర కారుడు "ఆర్‌నోల్డ్ వాయన్‌బి వారి యభిప్రాయము మేరకు చరిత్ర యనగా నాటి మరియు నేటి సంస్కృతి యన్యోన్య సంభాషణ ప్రతిబింబమై యున్నది; యూరోప్‌లోని ప్రసిద్ధి జెందిన ఇతిహాస కారులలో ఒకరైన A. J. గ్రాం. గారి ఆశయము ప్రకారము చరిత్ర తాత్విక మరియు ధార్మిక సంఘటనా శక్తుల కలయిక అనబడును; ఆంగ్లేయులు భారతదేశ చరిత్రను పలువిధములైన ధర్మముల ఆవాస స్థానమని నిర్ణయించిరి.

వీరశైవ ధర్మమనునది మన స్వతంత్ర భారతదేశము యొక్క ప్రాచీన ఆర్యసంస్కృతికి పరమోత్కృష్టమైన అంగముగా నున్నది. ఇట్టి శ్రేష్ఠతమమైన ధర్మము యొక్క ప్రాచీనతను, వీరశైవ చరిత్రను, మనము గుర్తించి విశేషమగు ధార్మిక సంపదను అనుభవించునట్టి సుయోగమును బడయనగును.

లేఖకులు :- బి. డి. శ్రీనివాసరావు, ఎం.ఏ; మాజీ మేనేజర్ కర్ణాటక ప్రాంతము యొక్క రచనా సమితి, అమల్దార్ గుండప్పదీధి తుమకూరుగారు.

ప్రకాశకులు :- శ్రీ కె. వి. గురురాజరావు; హైస్కూల్ ఎక్స్టెన్సన్ తుమకూరు గారు

ముద్రకులు :- బి. ఎస్. శంకర్ సిటి, ముద్రణాలయము తుముకూర్ గారు

## వేదముల కాలము

విశేషజ్ఞులు [పరిశోధకులు] వేదముల కాలమును గురించి క్రీ. పూ. 1500 సం॥ములని కొందరు, మరి కొందరు కీ. పూ. 2000 సం॥ములనియు, ఇంక కొందరు క్రీ.పూ. 4000 సం॥ములని చెబితె: మరికొందరు క్రీ. పూ. 6000 సం॥ములకు పూర్వమున వేదముల రచన జరిగినదనియు విద్వాంసుల అభిప్రాయము. వీరశైవ ధర్మము వేదకాలమున కంటె పూర్వమే తన ప్రభావ పూరితమైన దృఢమైన పునాది గలిగి అత్యుత్తమమగు అస్తిత్వ భారమును బడసి యుండినది.

నేటికి 5000 సం॥ములకు పూర్వమే సద్యః పాకిస్తానుకు చెంది యున్న మొహంజోదారో-హరప్పా" ప్రదేశములను లోగొని సింధునది యొక్క బయలు [ఎడారి] నందు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన గొప్ప

నాగరికతను సంతరించుకొని యుండి, విశేష ఇతిహాస మహత్వపూరిత విచారమునుగూర్చి, ప్రసిద్ధ పురుషుఁడైన, ఇతిహాస పరిశోధకుడైన మ్యాక్స్ మిల్లరు. భ్యూలర్, మార్టిమర్, విల్లర్. డా. ఎమ్. హెచ్. కృష్ణ మున్నగు వారందరు తమతమ ఉపన్యాసములద్వారా నైతేనేమి, మరియు గ్రంథ రచనలద్వారా నైతేనేమి, ప్రజల ముందు వ్యక్తపరచి యున్నారు. ఈ సింధునది పరిసర ప్రాంతమందలి నాగరికతలోని ప్రజలు బసవని [నంది] పూజించు చుండిరని ప్రతీతి యున్నది. ఈ విషయమును బలపరచినవారు "ప్రీహిస్టారిక్, సివిజేషన్" అను గ్రంథ రచనఁ జేసిన శ్రీ కె. ఎన్. దీక్షితులు, ఇదే కాలమున లింగపూజా పద్ధతిఁగూడ ఆ చరణలో నుండెననియు, ఈ లింగమునకు "శివశక్తి" అను పేరుండెడిది. సాక్షాత్పరమ శివుడే ఈ నాగరికత కాలమున ప్రముఖమైన అధి దేవతలలో ప్రాధాన్యతగా పరిగణింపఁబడు చుండెను. ఈ విషయములఁ గూర్చి చాల కూలంకషముగా శ్రీ డి. ఆర్. భండార్కర్. ప్రొఫెసర్ ల్యాంగ్డన్, ప్రొ. వి. రంగాచార్యులు, సి.ఇ.ఎ. జోడ్ మొదలగువారు సమగ్రముగా చర్చించి గ్రంథములను రచించి ప్రకటించి యున్నారు.

ఆకారణముచేత ఇట్టి లింగ పూజను స్వామి బసవేశ్వరుల వారు సృష్టించినది గాదు. ఈ లింగార్జన గత కాలముయొక్క వైభవమునకు గొప్ప చిహ్నము. శ్రీ బసవేశ్వరుడు ఇట్టి లింగ పూజకు ఒక క్రమపద్ధతిని సమకూర్చి యున్నాడు. ఒక సువ్యవస్థతకు దెచ్చి యున్నాడు. మనుస్మృతి చేత సృష్టింపఁబడిన జాతి పద్ధతులను వీరశైవులంగీకరింపరు. మహా భారతము ప్రకారము వీరశైవులు ప్రాచీన అతి వర్ణాశ్రమము యొక్క బ్రాహ్మణులనియు, జనివారమునకు మారుగా లింగమును ధరించి యుండి రనియు దెలియ నగును. వీరు శివుని యారాధకులై యుండిరి. అందుచేత బసవేశ్వరునికంటె పూర్వమే ప్రజలు లింగము యొక్క మహత్వము

నెఱింగి లింగధారణఁ జేసికొని యుండిరి. దేవతలు, ఋషులు, మానవులు, లింగము నర్చించి ముక్తిని బడసి యుండిరని దెలియుచున్నది. రామాయణ మహాభారత నాయకులందరు లింగారాధకులై యుండిరి.

పురాణములు మరియు స్మృతులు శివలింగమును ధరించి పూజించు విధానమునకు నధిక ప్రాముఖ్యత నొసంగినవి. వ్యాస మహాకవిగారి శంకర సంహిత, లింగపురాణము, స్కంద పురాణము, భాగవతము, మహాభారతము లింగము యొక్క మహత్వమును గురించి ప్రపంచమునకు మిక్కిలి చాటి చెప్పినవి. మను, పరాసర, గౌతములు, తమ స్మృతులలో ఈ వీరశైవ ధర్మప్రభావమును ప్రదర్శించి యున్నారు. పై నుల్లేఖింపఁబడిన విషయములఁగూర్చి రావుబహద్దూర్ శ్రీ పి.జి. హాళకట్టి వారి "శివానుభవ" అను మాస పత్రికలో, మద్రాసు టాగూరు, లా కాలేజీకి ప్రధానాచార్యులైన శ్రీ కె. సుబ్రహ్మణ్యం, ఆర్. సి. సి. కార్, డా॥ వి. వి. రమణశాస్త్రి యార్, యూరోపులోని సుప్రసిద్ధ ఇతిహాస కారుడైన ఆచ్చిడూబియన్, డా. ప్రాన్సిస్, బుచనన్ కర్నల్ విల్సన్, సి. పి. బ్రౌన్, డా. ధిబాట్, సయటమే కాండన్, ప్రొఫెసర్ మ్యాక్స్ముల్లర్, మొదలగువారి గ్రంథముల ఆధారములు ప్రభావ పూరితములై యున్నవి.

లింగార్చన అతీవ ప్రాచీన కాలముమండియు వచ్చియున్న సాంప్ర దాయము గలదై యున్నది. దీని పూజ ఉత్పత్తి విషయమై విద్వాంసులలో భిన్నాభిప్రాయములున్నవి. ఇవి ధార్మిక పూజకు లోఁబడిన విషయము. కావున ఇతర విషయములవలె దీనిని ఇతిహాసముగా వివేచించుట అనుచితము, పాపకారము, అని భావించు వారును ఉన్నారు. ఆర్యులు ఈ దేశమునకు విచ్చేయుటకు పూర్వమే ఇక్కడ లింగ పూజే యుండెననుటకు "మొహంజోదారో" "హరప్పా" ప్రాంతములందు లభించియున్న లింగములే

ప్రబల ప్రమాణములై యున్నవి. దేహము (అంగము) పై లింగమును ధరించి పూజించుటను ప్రచారము గావించిన వారిలో మహానుభావుడైన బసవన్నగారే చివరి వారు. వీరు లింగము విషయమై యాదేశించిన ఈ దిగువనున్న వచనము లింగ తత్వము యొక్క వ్యాపకత్వమును సుస్పష్టముఁ జేయుచున్నది.

వచనము :- "జగదగల: ముగిలగల, మిగెయగల, నిమ్మగల, పాతాళదిం దత్తత్త నిమ్మ శ్రీ చరణ, బ్రహ్మాండదిం దత్తత్త నిమ్మ శ్రీముకుట, ఆగమ్య, అప్రమాణ, అగోచర, అప్రతిమ లింగవే కూడల సంగమ దేవయ్య ఎన్నకర స్థలక్కె బందు చుళుకాది రయ్య" దీనినే సంస్కృతములో "అత్తితిష్ఠతి దశాంగుళమ్" అనగా విశాలమైన ప్రపంచముకంటె పది యంగుళము లధికను. అంతటి విరాట్ రూపమైన మీరు నా యరిచేతిలో అల్పాకారమున నుంటిరయ్యా.

లేఖకులు హర్డేకర్ మంజప్ప గారు ఈ జిప్టులో దొరికిన చిత్రలిపికిని, సింధు ప్రాంతములో లభ్యమైన "మొహంజోదారో" "హరప్పాల" లోని లిపికిని సామ్యమున్నదనియు, ఇది ఆ కాలమునాటి ప్రజల విచారము మరియు భావములను దెలియజేయుచున్నవి; అనిరెవ్ రెండు హెచ్. హేరాస్ మొదలగు సుప్రసిద్ధ చరిత్ర కారులు [ఇతిహాస పరిశోధకులు] చెప్పియున్నారు.

K. H. హేరావ్‌గారు "మొహంజోదారో" సంస్కృతి క్రీస్తు పూర్వము అయిదువేల సంవత్సరములకు సంబంధించి తేది 29జనవరి 1939న బొంబాయిలో నుపన్యసించిన ఉపన్యాసములో నీ విధముగా నుడివి యున్నారు. "మొహంజోదారోలో" చిత్రించినట్టి రెండు రకాల [కోడ్లియు] కలయుట-కూడు-అమ అర్థమును దెల్పునట్టి సంకేతమై యున్నది.

కర్ణాటకములోని లింగాయతుల ఇండ్లలో ఇప్పటికిని ఇది దర్శన మిచ్చు చున్నది. ఈ సంకేతము పురుషుని మరియు ప్రకృతుల ఐక్యతను నిదర్శింపఁజేయు చున్నది. రెండు త్రికోణములే పురుషుడిని మరియు ప్రకృతులను దెల్పునట్టి సంకేతములు. ఈ [2] త్రికోణముల కలయిక యే [సంబంధమే] షట్కోణములు లింగాయతుల షట్స్థల చిహ్నము. [సంకేతము]

శైవ మతమే ప్రపంచములోని సమస్త మతములలోను మిక్కిలి ప్రాచీనమైనది. శివుణ్ణి లింగరూపమున అతీవ ప్రాచీన కాలము నుండియు ఆరాధించుచుండిరి. ఇందులో గంభీరమైన అర్థమిమిడి యున్నది. వేద కాలమునకంటెను బహు ప్రాచీన కాలమునందే అనగా ఆరేడువేల సంవత్సరముల కంటెను పూర్వమే ఆదిమానవుని కాలమునందే వీరశైవమను వట వృక్షము వర్ధిల్లి యుండెను. లింగమును కంఠము నందు ధరించుట, దానిని బిల్వదలముతో బూజించుట, శివయోగ పద్ధతిలో ధ్యానించుట, శివుణ్ణి శక్తి విశిష్టునిగా భావించుట, శివ శక్తులను అభేదమును [అద్వైతమును] జూచుట. మున్నగు వీరశైవుల ముఖ్యతత్వము లన్నియు "మొహంజోదారో" "హరప్పా" నాగరికత కాలమునందే యుండుట వలన వీరశైవ ధర్మము యొక్క పుట్టుక [ఆవిర్భావము] ఆనాడే యుండివ దనుటలో సంశయమే మాత్రములేదు. ప్రధానమైన వీధులు, స్నానము గదులు, గృహములు, మఠ, మందిరములు మొదలగునవి సుసంస్కృతిని గలిగి యుండినవి. ఆనాటి ప్రజలు నాగరికత గలవారై యుండిరి. మరియు శివాద్వైత సిద్ధాంతముపైన వివరించినట్లుగా వారిలో ఆనాడే రూపు దిద్దుకొని యుండెను. కనుక శివాద్వైత బీజము దానికంటె మొదలే బీజవాపనము జరిగి యుండవచ్చు.

శ్రీ టి. ఎన్. మల్లప్ప; బి.ఎ.ఎల్.ఎల్.బి. హైకోర్టు జడ్జి బెంగుళూరు గారు వీరశైవ త్రైమాసిక జూన్ 1962 సంపుటి 3వ సంచిక 9లో

-: లింగ రహస్యము :-

లింగపూజ తామ్రయుగము అనగా [6000] ఆరువేల సంవత్సరములకంటె పూర్వములోనుండి నదని సర్జాన్ మార్షల్ అనునాతడు తమ పుస్తకములో వ్రాసి యున్నట్లు లింగార్చన భారతదేశమున విశేషముగా నుండుటయేగాకుండ రోము యూనాన్ మిస్ర. పశ్చిమ దేశాలు, అరబ్ దేశము, ఫ్రాన్సు, చైనా, జపాన్, ఈ దేశములలోను వ్యాపించి యుండెననియు, మొత్తముపై యించుమించు ఇదీ [సమస్త] ప్రపంచములోని అన్ని దేశములందును లింగరూపమున నున్న శిలా విగ్రహాన్ని స్మారకముగా నిల్పుకొని యుండిరనియు, బాల అథవా బాలేశ్వర లింగమునకు క్రైస్తవుల మతగ్రంథమైన బైబిల్‌లో "శివున్" అని వ్యవహరించు చుండిరనియు, చెప్పఁబడి యుండుటయే గాకుండ లింగార్చన అథవా లింగపూజ అనునదొక సాంప్రదాయమే ఉండేదనియు, అదేరీతిలో ప్రస్తుతము దక్షిణ దేశమున లింగాయతులున్నట్లుగా వ్రాసి యున్నాడు.

వీరశైవ ధర్మము యొక్క పుట్టుకనుగూర్చి లింగధారణోపనిషత్తులో :- కల్యాణ్, అను హిందీ మాస పత్రిక విశేషాంకము "శివాంక" మను సంపుటి (సంచిక)లో శ్రీరామ దాసజీగౌడ M. A. అనువారు లింగ రహస్యమను నొక వ్యాసము (లేఖ)ను వ్రాసి యున్నారు. దానిలో "లింగార్చనము యొక్క వ్యాపకత" అను శీర్షిక క్రింద తామ్ర యుగమును గుఱించి వ్రాయుచు ఈ దిగువ విషయమును వివరించియున్నారు.

వీరశైవ ధర్మము యొక్క పుట్టుకను గూర్చి లింగాధారణోపనిషత్తులో :- శ్రీమన్నిరంజన చరవర్య శివ బసవ మహాస్వాములవారు హుక్కేరి మఠము హావేరిలో ప్రసిద్ధిగాంచిన శ్రీ చన్న మల్లప్ప. సూరొందప్ప కొరిగార్ ఈ విధముగా ప్రకటించి యున్నారు. హావేరి శివలింగ ముద్రణాలయము నందు ముద్రించిరి. 1935 ఇసివి, హరప్ప మొహంజోదారో అను స్థలములలో ఖననమునందు లింగములు మఱియు శివుడు యోగాసనాసీనుఁడై యున్నట్లున్న విగ్రహము లభించుటచేత శైవధర్మము వేదకలముకంటె ముందెయుండినదనియు, సుమారు ఆరువేల సంవత్సరములకంటె బహుప్రాచీన కాలమునందే యుండినదని తెలియఁజేయుచున్నది. శైవధర్మము ఎందు ఆవిర్భవించినదో ఆనాడే లింగధారణము యొక్క సాంప్రదాయము రూఢిలోనికి వచ్చియున్నదని దృఢముగాఁజెప్పవచ్చును. శివాగమములందు శైవవీరశైవ ధర్మము, ఈ రెండింటిని అనుసరించుటకు భిన్నాభిన్న యోగ్యతఁ గలవారిని ఉద్దేశించి నిరూపింపఁబడినదేగాని, ప్రప్రథమములో శైవముండినది. ఆ మీదట "పాలలో నెయ్యి" వలె వీరశైవము సంస్కారాచార విచారతత్త్వముల ప్రాబల్యముల చేత సిద్ధించినది.

హరప్ప మొహంజోదారో పట్టణ నిర్మాణము విషయములో మార్షల్ గారు ప్రకటించిన గ్రంథములో సద్యః వీరశైవులు ధరించుచున్న లింగముల మాదిరిగానే నున్న లింగములు దొరికియున్నవి. అనుతెఖను అనుసరించి లింగమును ధరించియున్న ఒక శక్తి విగ్రహముగూడ అట యున్నది. ఇదే విధముగా ఇంకను పరిశోధించుచూ పోయిన యెడల లింగధారణ ప్రాచీనతకు విరివిగా ప్రమాణములు తప్పక లభించును.

బ్రాహ్మణులకు వేదములెంత ప్రమాణ ప్రధానములో, క్రైస్తవులకు బైబులు ఎట్లు ప్రమాణమైనదో, మహమ్మదీయులకు ఖురాను ఎంతట

ప్రమాణమైనదో శ్రేష్ఠమైనదో, వీరశైవులకు ఆగమగ్రంథములంతే ప్రమాణము లైయున్నవి, శ్రేష్ఠములైనవి గూడ. ఇందులో ఎలాంటి సంశయమునకు అవకాశముండదు. ఉండకూడదు. మొత్తముపై ఆగమములు దేవుడొక్కడే, కనుక ఏకేశ్వరోపాసనయే శ్రేష్ఠమైనది. అని మనలను ఆదేశించుచున్నవి. బసవేశ్వరుని వచనము "దేవుడొక్కడు, నామము లనేకములు, పరమ పవిత్రతకు భర్తయొకడే" అని నుడివియున్నాడు.

## మౌర్య వంశము

క్రీ. పూ. 231 సం॥ లో మౌర్యుల ప్రతాపము తగ్గి నవనందులు వారిపుత్రుడగు చంద్రగుప్తుడు మగధ సింహాసము నాక్రమించి చంద్రగుప్తుడు మౌర్యవంశమునకు మూలపురుషుడయ్యెను. అది క్రీ. శ. 184 సం॥ లో అస్తమించెను. (ఈ వంశమున అశోకుడు మరణించిన పిదప) నవనందులు మరియు చంద్రగుప్తుడు భారతీయులేగాక వీరశైవులైయుండిరి కూడ.

క్రీ. శ. 1వ శతమానములో నున్నట్టి భారశివ వంశజులు (కాశీ ప్రాంతము వారు) వీరు శివునిప్రసన్నునిగాఁ జేసికొని రాజ్యమును బడసిరి. వీరు శివలింగ ధారులు.

క్రీ. శ. 1. వ శతమానములో నున్నట్టి నక్కీరుడు అను తమిళ కవి వీరశైవమును (సామ వేదాచల పండితులు) తమిళ "అంటపురి" అను గ్రంథమున వివరించియున్నారు.

క్రీ. శ. 150లో నున్నట్టి వాకాటులు శివలింగమును శరీరముపై ధరించుచుండిరి. ఈ వాకాటులు భారశివులతో శరీర సంబంధమును

బెంచుకొనిరి. ఆ భారశివులు శివలింగమును తమ భుజముపై ధరించు చుండిరి. వీరు క్రీ. శ. 2. వ శతమానము వరకు ఉండిరి. వీరు తమ కాలములో కట్టించిన దేవాలయములందలి మూర్తులకు శివలింగ ధారణ ముండినది సుస్పష్టము.

క్రీ. శ. 150 నుండి 320 వరకు భారశివనాగుల కాలము. ఈ భారశివనాగులు బరువుగా నున్నట్టి లింగములను తమ భుజములకు ధరించు చుండుట చేత వీరికి భార శివనాగులను పేరు రూఢి యైనది. శివుణ్ణి మఱియు ఆదిశేషుని బూజించి లింగమును ధరించుటవలన వీరికి భార శివ నాగులను పేరు వచ్చినది. నేటి వీరశైవ ధార్మిక ప్రతిభకు మఱియు ప్రసిద్ధికి దృఢమైన ఆస్తి భారమును ధారాదత్తము చేసియుండిరి. ఇట్టి భార శివనాగులే వీరు ఆర్య సంస్కృతిని ప్రధానముగా పోషించియున్నారు. క్రీ.శ. 3 వ శతమానమున పాండ్యరాజులలో ముఖ్య (ప్రధాన) మంత్రియైన ''మాణిక్య వాచకర్'' అను వారు వీరశైవులు. వీరు ''తిరువాచక'' మను గ్రంథమును రచించిరి. క్రీ. శ. 5. వ శతమానమున చంపా-కాంభోజ దేశములందు వీరశైవులుండిరి.

క్రీ. శ. 345 నుండి 610 వరకు కదంబకాలము. ఈ సమయమున శైవమతము వర్ధిల్లుచుండునప్పుడు ప్రాచీనవేదకాలము కంటె మొదలె ఉన్నట్టి వీర శైవధర్మములో "లింగాయతులు" అను పేరు క్రొత్తగా రూఢిలోకి వచ్చి ప్రఖ్యాతి గాంచినది.

క్రీ.శ. 6 వ శతమానమున జైనపండితుడగు "రేవ కోట్యాచార్యుడు తన "వడ్డారాధన" అనుగ్రంధములో "పాల్ల" లింగవంతులను-లింగాయ తులను హాస్యముఁ జేయుచుండిరి. క్రీ. శ. 7 వ శతమానము

"పట్టకూతర్" అను వీరశైవ తమిళ మహాకవి "దక్షయాగ పరణి" అను గ్రంథమును వ్రాసియున్నాడు. ఈ గ్రంథము అత్యంత ప్రాచీనమైనదని తిరుచినాపల్లి తమిళ వీరశైవ పండితులు కుమార వీరయ్యగారి ఉపన్యాసము నుండి దెలియుచున్నది. ఈతఁడు 2000 సం॥ములకంటె మొదలె యుండెనని కవి చరిత్రకారులు దెల్పుచున్నారు.

క్రీ. శ. 783. జనసేనుడను జైనమహాకవి తన మహాపురాణములో కులింగులని లంగాయతులను తూలనాడినాడు.

క్రీ. శ. 8. వ శతమానములో లింగవంతులు ధరించునట్టి లింగ వ్యవహారముండెడిదని నిశ్చయింపబడినది. దానికంటె మొదలె క్రీ. పూ. నుండే ఇక్కడున్నవారికి అనగా సుమారు 20. వ శతమానము వరకు లింగధారణము అవ్యాహతము (నిర్విఘ్నము)గా వచ్చియున్నది.

క్రీ. శ. 9. వ శతమానమునుండి 11. వ శతాబ్ది వరకు వీరి కాలమని నిర్ణయించి నట్టి జంగమ, మల్లికార్జున శివయోగి వీరశైవుడు. ఇతడెవరినుండి శివదీక్షను బొందియున్నాడనునది తెలియుటలేదు. ఇతఁడు మొదలు మల్లరాజధరణీవల్లభుడై యున్నట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 10. వ శతమానము నందున్నట్టి సుప్రసిద్ధుడైన జైన మహాకవి "పంపడు" తన కావ్యములో కులింగులను గూడ సేవించదగును; అని లింగాంగులను గురించి పశ్చాత్తాపమును బొంది యున్నాడు.

క్రీ. శ. 10. వ శతమానములో నున్న హరిభద్రసూరి అను జైన విద్వాంసుడు ఆది రేవణ సిద్ధుడు వ్రాసిన బ్రహ్మసూత్రమునకు వీరశైవ భాష్యమును జూచి

"ఓం బేకః కారికాం వేత్తి-తంత్రం నేత్తి ప్రభాకరః।
వామనస్తూ భయం వేత్తి-న కించిదపి రేవణః॥

అనగా ఓం బేకుఁడను వాఁడు జైన కారికను, మరియు తంత్రములను దెలిసి కొని యున్నాడు. రేవణ (రేవణసిద్ధుడు) అయినను జైన మతము యొక్క ఏ విషయమును గూడ గుర్తించలేదు. అని నిందించియున్నాడు.

క్రీ. శ. 941 నుండి 996 చాళుక్యవంశపు రాజైన మొదటిరాజు "అనిల్ వాడ" అను రాజ్యమును పరిపాలించు చుండెను. ఆ రాజ్యమునకు కాఠె(రె) వాడకచ్ దక్షిణ గుజరాతులను గలిపి వేసెను. (ఒకటిగాఁజేసెను) దీనికి కొలంకి వంశమని పేరుండెను. ఈతని సంతతి వారు రెండు శత మానముల వరకు పరిపాలించిరి. వీరు వీరశైవులు. క్రీ. శ. 1026లో ఘజనీ మహమ్మద్ సోమనాథ దేవాలయమును శిథిలమొనర్చగా వీరు దానిని జీర్ణోద్ధారము గావించిరి. ఈ సంతతి వారు క్రీ. శ. 1143. వరకు పాలించిరి.

క్రీ. శ. 1191లో చంద్రగుప్తుని వంశపు గుప్తరాజుండెను. ఈతని తాత విక్రమాదిత్యుడు. ఈ వంశమునకు మొదటి వారు. ఈ చంద్ర గుప్తాదులు లింగధారులు.

ఉత్తరమున కుషానులు భారశివులు, మధ్య భారతములో వాకాటులు, గుప్తులు, దక్షిణ భారతములో చాళుక్యులు, రాష్ట్రకూటులు, చోళులు, పాండ్యులు, మున్నగు వారందరు రాజ్యాధికారపు సమయములో లింగ ధారణము రూఢి యందుండినదని పై యాధారముల వలన ధృవపడు చున్నది. అంతకు పూర్వము రామాయణము, మహాభారతము, శైవాగమము, మొదలగు వానిలో శివలింగ ధారణముల యొక్క దృష్టాంతములు

కోకొల్లలుగా నున్నవి. శాసనములయొక్కయు, శిలావిగ్రహముల యొక్కయు, ఆధారములు ఈ విషయమును అధికముగా ధృవ పఱచుచున్నవి. లింగధారణ పద్ధతి అనాదికాలము నుండియు వచ్చియున్నదనుటకు, శా. శి. చె. నంద మతగారు పై నుట్టంకించిన యాధారములు ధృవపఱచుచున్నవి.

ఇప్పటికి 6000 సం॥ ములకు పూర్వమున "మొహంజోదారో" యందు లభించిన చిత్రలిపిలో నున్న అక్షరములు 390 వరకు యోగాసన మునందు గూర్చొనియున్న శివ విగ్రహమున్నది. శివలింగములు కూడా లభించినవి. ఇసుప కరండకము (లింగముంచు పెట్టె), లింగపుకాయలో బెట్టుకొని మానవులు తమ ఎదపై ధరించు పదకమొకటి లభించినది. అది వేదములకంటెను అతి ప్రాచీన కాలము (6000) ఆరువేల సంవత్సరములు గడచినవే గాకుండ అంతకంటె ప్రాచీన సంస్కృతి గలదని భావించనగును.

క్రీ. శ. 1. వ శతమానమునుండి 10. వ శతమానము వరకు బాణులు, వృషభలాంఛనము వారు. నందీశ్వరుని భక్తులు. వీరు వీర శైవ మతావలంబులై యుండిరి. క్రీ. శ. 460 లందున్న విష్ణుకుండినులు గూడ వీర శైవులు. క్రీ. శ. 5-6 వ శతమానములో నున్న 63 మంది పురాతనులలో 8 మంది మాత్రమే వీరశైవులు. వారెవరనగా 1. చిరుపులి. యాండరు, 2. మొనె యాండరు, 3. మాన కంజురులు, 4. పగల్ చోళ, విక్రమ చోళులు, 5. కలికామదేవరు, 6. అమరనీతులు, 7. కలి కంబరు, 8. కలిగణనాధుడు. (ఈ ఎనిమిదిమంది) వీరు మాత్రమే వీర శైవులు. వీరివి గూర్చి చరిత్ర ప్రత్యేకముగా వ్రాయబడినది. మిగత 55 మంది వీర శైవేతరులు. అయినప్పటికినీ వారికి వీర శైవులవలె శివుని యందు సాటిలేని భక్తి యుక్తులున్నవి, కనుక శివునకు దమ ప్రాణములనే సమర్పించియున్నారు. వారిలో కొందరు జంగమ భక్తి కలవారై యుండిరి.

ఈ యనమండుగురులో కలిగణనాథుడు దక్షిణ భారతదేశములో చోళ దేశమునకు జెందిన శివపురమునకు రాజు. ఈతడు శివభక్తియుక్తుడే గాకుండ అంగముపై లింగములేసి వారిని దర్శించనని ప్రతిన బూనుటే గాకుండ, తన రాజధానిలో నుండు ప్రతియొక్కరు లింగాధారణఁ జేసి కొనవలెనని యాజ్ఞాపించెను. ఈ మహాభక్తుని రాజధానియందు ఎట్టి భయము లేకుండ సుభిక్షముగా నుండినది. ఇతని భక్తినిఁ బరీక్షించుటకై శివుడు భవి (లింగములేనివాడు) యై వచ్చి "నేను రాజును దర్శించవలెను, నన్ను లోనికి వదలండి" అని చెప్పుటలో ద్వారపాలకులు "రాజు భవులకు దర్శనమొసగఁడు. నీవు వెంటనే లింగమును ధరించుకొని రావలసినదిగాఁ జెప్పిరి. భవి రూపములో నున్న శివుడు దానికంగీకరింపక ద్వారపాల కులతో "నాభూమిపై పన్ను అధికముగా వేసియున్నాడు. దానిని గురించి రాజునకుఁ జెప్పకోవాలి, కావున నన్నులోనికి వెళ్లనీయండి" వారితో జెప్పు కుంటాను అని వాదించగా దానికి ద్వారపాలకులు "నీ విక్కడే యుండుము. నేనే లోనికి వెళ్లి రాజునకుఁదెల్పుతాను" అని చెప్పి లోనికివెళ్లి అనుభవమంట పములో నున్న రాజునకు చెప్పగా రాజు "నేనెవరికిని యధికపన్ను వేయలేదు. సరిగానే యున్నది." అని చెప్పిపంపెను. ద్వారపాలకుడు తిరిగివచ్చి ఆతనితో చెప్పగా ఆ రైతు అందుకు అంగీకరింపలేదు. ద్వారపాలకుడు రైతు వాదమును రాజునకు నివేదింపగా రాజు అప్పుడు ఆవేశముతో చేత ఖడ్గమును ధరించి యాతని శిరమును ఖండించుటకైరాగా అప్పుడు శివుడు రాజు భక్తికి ప్రసన్నుడై "నీకు కావలసిన వరమును వేడికొనుమని చెప్పగా. రాజు వినయముతో "మహాదేవా! నాకు నీ శరీరముపై లింగమగుపడుటలేదు కావున నీవు శివలింగమును ధరించినచో నాకంతేఁజాలును. అదియే నాకు వరము." అని ప్రార్థింపగా అప్పుడారాజు కోరికమేరకు శివుడు తన శరీరముపై నున్న లింగమును జూపి ఆతనికి గణ పదవిని గరుణించెను.

అణియరియద భక్తిధారుణిగె పొసతాగిమ ।
న్నణెబోళీ శంగే శివలింగ విత్తకలి ॥

గణనాథ నెన్నకుల గురువు॥ శ్రీ నిజగుణ శివయోగి, మానకంజర :- మహావీరశైవాగ్రేసరులైన మానకంజరుడు సాధ్వియగు చంద్రమతి యను ధర్మపత్నితోఁబాటు గురు - లింగ - జంగమ పూజాసేవలో నాసక్తుడై మహేశ్వరులేమి యడిగినను ఇచ్చెదనను ప్రతినఁబూని సమస్తజనులకు వీరశైవ తత్వమును బోధించు సమయమున, సంతానములేని కొరతతో బెంగపెట్టుకొనగా, తన ధర్మపత్నిని జేరఁదీసి శివుని యారాధించి, ప్రసన్నునిగావించుకొని, ఒక పుత్రికనుగని, ఆమెకు సోమప్రభయను పేరిడిరి. ఆపుత్రిక యుక్తవయస్కురాలు కాగా "కరియూర పురమునకు" ప్రభువైన విక్రమ చోళుని పుత్రుడు పగల్ చోళునకిచ్చి వీరశైవ పద్ధతి మేరకు పంచ కలశమును స్థాపించి, మాంగల్యధారణఁజేయు సమయమున, శివుడు వృద్ధ జంగమ రూపమున వచ్చి, సోమప్రభ శిగముడిని దానమడిగెను. అప్పుడు మానకంజరుడు కొంచెమైనను సందేహింపక మరువము పుష్పములతో నలంకరించియున్న శిగముడిని కోసి యిచ్చెను. సోమప్రభ గూడ సంతోషముతో నమస్కరించినది. ఆ సమయమున అక్కడఁజేరిన జనులందరు జంగముని దూలనాడిరి. అప్పుడు శివుడు ప్రత్యక్షమై సోమప్రభ శిగముడిని యథారీతిగా నుండునట్లు ఆశీర్వదించి మానకంజరుని గైలాసమునకు దీసికెళ్ళెను. గణపదము నొసగెను.

''ధరణీశ మానకం । జరమంగలార్ధదోళ్ ।
చరబేడె మగళపేర్ముడియ ॥
అరిదు తొండిలు దండ । వెరసిత్తనివకొట్ట ।
పిరిదు వస్తువ దావుదెనలు ॥

(భైరవేశ్వరకావ్య సం. ౪ పద్యము ౪౧ హరిహర నిజగుణ శివయోగి)

పగల్‌చోళ :- కరియూరు పురము యొక్క ప్రభువగు విక్రమ చోళుడను రాజు వీరశైవ ధర్మమును ప్రజలలో ప్రచారమగునట్లుగా మంచి యుపన్యాసకులను నియమించి అనేక గ్రంధాలయములను స్థాపించి (పుణ్యకథలను) కీర్తనల ద్వారా వీరశైవ తత్త్వము విశేషముగా వ్యాపకమగునట్లు కృషిసల్పి, పిదపకు పగల్‌చోళునకు పట్టాభిషేకము గావించి, తాను కేవలము శివ చింతనతో కాలక్షేపముఁ జేయుచుండెను. ఇట్లుండ ఒకనాడు పగల్‌చోళుడు శత్రువైన పాండ్యరాజుతో యుద్ధము జరిగినప్పుడు శత్రువుల ప్రతి యొక్క రుండమును దెచ్చిన వారికి ఒక్కొక్క చాటడేసి వరహాలనిచ్చెదనని డంగుర వేయించగా దానిని విని సైనికులు శత్రువులను జెండాడుచు రుండములను దెచ్చియిచ్చిరి. అప్పుడు భస్మ రుద్రాక్షలను ధరించిన శిరమొండును సైనికులు దెచ్చియివ్వగా శివభక్తుల హత్య జరిగెను గదా ! యని భావించి ప్రభువు పశ్చాత్తాపముతో దానికి ప్రతీకారముగా తన శిరమును గోసియివ్వగా శివుడందుకుఁ బ్రసన్నుఁడై ప్రభువు ప్రార్థన మేరకు మరణించిన శివ భక్తునకు ప్రాణ ప్రతిష్ఠ గావించి యా రాజదంపతులకు మోక్షమొసఁగెను.

## కలి కామ దేవుడు

తిరునల్లూరు పట్టణము శివభక్తులకు పుట్టినిల్లుగా నుండినది. ఆ పట్టణమునకు రాజు కలి"కామదేవుడు" పరిపూర్ణ శివభక్తుడు. శివార్చనఁ జేయని దుర్మార్గులను శిక్షించుచు గురులింగ జంగములందు భక్తియుక్తుడై ధర్మముతో రాజ్యమును పాలించుచుండెను. తిరువానూరుకు ప్రభువైన సౌందరనంబి తన భక్తిచేత శివుని తనకు సేవకునిగా చేసికొన్నాడన్న సంగతిని విని, ఇతనికి పట్టరానికోపము వచ్చెను. ఆ కారణమున సౌందరనంబితో యుద్ధము చేసి యాతనికి దగిన బుద్ధి గఱపవలెనని నిర్ణయించుకొనెను.

ఇట్లుండగా ఒక దినమున ఒక యాత్రికుడు తిరునల్లూరునకురాగా కలికాముడు ఎక్కడినుండి వచ్చినారని యడుగగా నతడు తిరువానూరి నుండి సౌందరనంబి యాతిథ్యమును స్వీకరించి వచ్చియున్నాడనని చెప్పగా తక్షణమే యాతని శిరమును ఖండించెను. ఇట్లే ఆ గ్రామమునుండి వచ్చిన వారిని సంహరించుచుండగా ఇది విని సౌందరనంబి సేనతో వచ్చి కలికామ దేవునితో యుద్ధముఁజేసి పరాజితుడై పారిపోయి. దుఃఖితుడై శివుని ప్రార్థించెను. శివుడు ఈతనిని పరీక్షింపఁదలఁచి జంగమ రూపమున వచ్చి ఆతిథ్యమును స్వీకరించి భోజనానంతరము ఎక్కడినుండి వేంచేసినారని ప్రశ్నింపగా సౌందరనంబి గ్రామమునుండి వచ్చితినని చెప్పి పారిపోయెను. తరువాత శివుడు సౌందరనంబిని దోడ్కొని వచ్చి యిద్దరికిని సంతోషమును గలిగింపఁజేసి కలికామ దేవునకు గణపదమును గల్పించి రక్షించెను.

అమరనీతి :- చోళమండలమున తిరునెల్లూరను పట్టణమున సత్యసంధుడను, శివభక్తియుక్తుడును, దయామయుడును, దానధర్మ నిరతుడును, అగు అమరనీతియను భక్తాగ్రేసరుడు, కనకమాల యను ధర్మపత్నితోను, ధనదత్తుడను పుత్రునితోడను గురు-లింగ-జంగమంబుల సేవానిరతుడై వస్త్ర విక్రయ వ్యాపార వృత్తితోఁ దన జీవితమును గడుపుచు, ప్రతినిత్యము ఒక వస్త్రము నర్పించియు, జంగమున కర్పించు నియమము గలవాడై సుఖముగా కాలమును గడుపుచుండెను. ఒకనాడు ఈతని భక్తిని పరీక్షించుటకై శివుడు జంగమ రూపముతో వచ్చెను. అప్పుడు అమరనీతి యా జంగమ మూర్తిని వస్త్రాభరణములతో నలంక రింపఁజేసెను. అప్పుడా కపట జంగముండు భక్తా ! నేను రామేశ్వర క్షేత్రమునకు బోవలసియున్నది. మార్గమధ్యమున దొంగల భయమున్నది. ఈ సమస్త వస్త్రములతో బాటు ఈ నా కౌపీనమును ఇక్కడే యుంచెదను. నేను రామేశ్వరమునుండి తిరిగి వచ్చునపుడు వీనిని దీసికొని పోయెదను.

ఇది చాల మహత్త్వము గలది. కనుక దీనిని అతి జాగ్రత్తతో ఉంచుమని జెప్పి వెళ్లిపోయెను. తరువాత కొన్నిదినములు గడచిన పిదప వచ్చి భక్తా ! నాకౌపీనమును దెచ్చి యిమ్మని అమరనీతిని అడిగెను. అప్పుడమరనీతి బహుజాగ్రత్తగా క్రొత్త వస్త్రముల మధ్య ఉంచిన కౌపీనమును వెదకి జూడగా, నది యగుపడదయ్యెను. అదిజూచి భయకంపితుడగుచు చేతులు జోడించి దేవా ! అది యేమయినదో నాకు దొరకడములేదు. (తెలియడములేదు) వేరె విలువైన దానిని దెచ్చి యిమ్మనిన ఇచ్చెదను, నన్ననుగ్రహించి దానిని స్వీకరింపుమని ప్రార్థించెను. అదివిని కపట జంగముండు అటులైన నా వద్ద మరో కౌపీనమున్నది. దానిని త్రాసులో ఉంచి, దానికి సమానము తూగె వస్త్రములను నా కిమ్మనెను. అలాగెనని దానిని పుచ్చుకొని, అమరనీతి త్రాసును దెప్పించి దానిలో ఒకవైపు పరడిలో ఉంచి మరో పరడిలో గృహములోనున్న వస్త్రముల నెన్నింటిని యుంచినను అవతలి పరడిపైకి లేవదయ్యెను. అప్పుడు అమరనీతి తన కుమారుని గూర్చుండఁబెట్టెను. అప్పటికి లేవదయ్యెను. అప్పుడమరనీతి దన ధర్మపత్నిని గూర్చుండఁబెట్టెను. అది కొంచెము పైకి లేచినది. చివరికి దాను జంగమమూర్తికి నమస్కరించి తానె ఆపరిడిలో గూర్చుండెను. అప్పుడు కౌపీనమున్న పరడి సమానముగా లేచినది. శివుడు అమరనీతి భక్తికిఁబ్రసన్నుండై పత్నీ పుత్రులతోఁబాటు అమరనీతికి గణపదమును గరుణించెను.

కలికంభుడు :— చోళ రాజ్యమున తిరుమలై అను నగరములోనున్న అత్యంత శివభక్తి తత్పరుడు "కళికంభుడను భక్తుడు సాక్షాత్తుగా జంగమ మూర్తే శివుడవి విశ్వశించి" పూజించుచూ, జంగమ తృప్తిఁజేయుచు అష్టావరణ, పంచాచారయుక్తుండై, సదాచార సంపన్నుండై, శివానుగ్ర హముతో తనకు లభించిన సంపదతో భార్యామణింజేరి సంతోషిముతో కా లక్షేపముఁజేయుచుండెను. ఈ విధముగా శివభక్తియుక్తుండయి

కలికంభుని వద్దనున్న ఒక సేవకుడు ఊడిగము జేసిజేసి అలసిసొలసి ఆతని గృహమును వీడిపోయెను. తరువాత ఇరువది సంవత్సరములు గడువగా అదే పరిచారకుడు దన మనస్సులో నా ప్రభువైన 'కలికంభునకు, జంగములన్న పంచప్రాణములు కనుక నేను ఈసారి జంగమ వేషములోనే యాతని కడకు వెళ్ళి ఆతనిచేత ఆదరాతిథ్యములను బొందవలెను; అని దలంచి జంగమ వేషధారియై జంగమ సమూహముతో బాటు దన యజమాని యింటికి వచ్చెను.

కలికంభుడు జంగములు వచ్చుటతోడనే లేచి యెదురుగావెళ్ళి నమస్కరించి ఇంటిలోనికి పిలిచి ఉన్నతాసనమును గల్పించి వారిని గూర్చుండబెట్టి దన ధర్మపత్నికి పాదప్రక్షాళనముఁ జేయుటకాజ్ఞాపించెను. ఆ సాధ్వీశిరోమణి జంగమ మూర్తుల పాదములను కడుగుతురాగా మధ్యనఁ గూర్చొనియున్న యా కపటజంగమునిఁ జూచి యతడు జంగముడుగాడు మన యింటిలో సేవయొనర్చిన పరిచారకుడు, ఇతడిప్పుడు జంగమ వేషధారియై వచ్చియున్నాడు. కావున నేనితని పాదములను గడుగను అని నుడివినది. అదివిని కళికంభుడు దన రెండు చెవులను మూసికొని కోపోద్రిక్తుడై "పరుసము దాకిన పిదప లోహపు వికారముండునా?" శివస్వరూపుడైన జంగముని గురించి నీవిట్లు తూలనాడుట సరియా? అని దన చేతనున్న ఖడ్గముతో తన పత్నియొక్క చేతులను ఖండించెను. ఇటువంటి 'కలికంభుని, యెనలేని భక్తికి శివుడు ప్రసన్నుండై నిజ రూపమును దర్శింపజేసి అతనిని కైలాసమునకు తీసికెళ్ళెను. గణపదవి నొసంగెను.

"చరవేషమంతశెద, చరన చరణవతొళెయ।
విరెతన్న సతియకర వరిద కలికంభ। రిరిసలెన్నువనే సుఖదల్లి॥

(శ్రీ నిజగుణ శివయోగులవారు)

చిరుపులియాండ :- చోళ దేశమున చిరుపుత్తూరను గ్రామమున చిరుపులియాండుడను, వీరశైవ శరణుడుండెను. అతడు అష్టావరణ, పంచాచారనిష్ఠుడు, హరగురుచరమూర్తులయందు అనన్య భక్తియుతుడు. గురుకరకంజాతుడై, జంగమ అనుయాయులందరికి లింగనిష్ఠను. పంచాచారములను బోధించుచుండెను.

తత్ఫలితముగా ప్రజలందరు అతని బోధలకు ముగ్ధులై పవిత్రాత్ము లైరి, మున్ముందు రానురాను, జంగమార్చన, జంగమతృప్తియందే, ఆసక్తి యధికమయ్యెను. జంగమారాధన లేనిదే భుజింపకుండెను. అది విని శివుడు ఈతని భక్తిని పరీక్షింపనెంచి ముప్పది యెనిమిది దినముల వరకు జంగమ దర్శనమాతనికి లేకుండ జేసెను. ఈతడు గూడ అన్ని దినములు ఉపోష్యముండి చివరకు జంగమ దర్శనము తనకు లేకపోవుట వలన ప్రాణము వీడుటకు సమకట్టెను. అప్పుడు శివుడు ప్రత్యక్షమై యాతనిని కైలాసమునకు తీసికెళ్ళెను.

మొనెయాండరు :- చోళ రాజ్యమునందు గురు-లింగ-జంగమ, పూజకుండయిన వీరశైవ భక్తుడు విభూతి రుద్రాక్షధారులయందు అతి ప్రేమగలవాడై భవులయందు ద్వేషము గలవాడై, ప్రతినిత్యము ఉషః కాలములో శివనామ స్మరణతో నిద్రలేచి, శౌచాచమనాదులను దీర్చుకొని, స్నానంబొనర్చి, భస్మ రుద్రాక్షలందాల్చి, పరిశుద్ధ స్థలమున గూర్చొని, ఇష్ట లింగార్చనమొనర్చి, యెవరైతె సహస్ర నాణ్యములనొసంగుదురో వారికి విరోధులైన భవులను నామాశేషముగావించుచు, దానినుండి వచ్చిన ధన ముతో గురు-లింగ, జంగమంబులను బూజించుచుండెను. తరువాత పగల్-చోళరాజు స్నేహితుడై యధిక ధనమును బడసి గురు-లింగ జంగ మంబుల తృప్తి పరచుచుండ, పాండ్యరాజు వచ్చి, పగల్ చోళపురమును

ముట్టడింపగా, పగల్చోళుడు 'మొనెయాండుని, యుద్ధము చేయుటకై పంపించెను. మొనియాండుడు యుద్ధములో భవులను చంపుచు, శివభక్తులను ముట్టకపోగా, శివుడు శివభక్తుని వేషముతో పాండ్యుని సైన్యములోనికి వచ్చి, పోరునకు నిలచి యుండగా మొనెయాండుడు శివ భక్తునితో యుద్ధము చేయనని ఆయుధమును పారవైచి, నిరాయుధుడై నిలచియుండగా, శివుఁడు పరీక్షించుటకై యాతని అవయవములను ఖండించినప్పటికిని అనన్యభక్తితో శివధ్యానముజేయుచు, సంతోషముతో నుండగా, శివుడు అతని భక్తికి ప్రసన్నుండై, మొనయాండుని శివలోక మునకు తీసికెళ్ళెను.

జనరై దెబవరక్కె తనగిత్త ధనవనెల్లవ తనువహిసదెచరసేవెగై దధిక।
మొనెయాండరెన్నొడెయరెంబె॥ (నిజగుణ శివయోగులవారు).

క్రీ. శ. 5వ శతమానమునకు పూర్వముగూడ లింగధారులైన వీరశైవ స్వాములుండిరని సిద్ధమగుచున్నది. క్రీ. శ. 640లో ఉన్న అన్నాం (ఉంపా) దేశము పో నగరము యొక్క ప్రభువైన ఇంద్రవర్మడు, వీరశైవుడు ఈతని కాలములో శివభక్తి ప్రాబల్యముతో నితని పట్టణము రెండవ కైలాసమువలె ప్రకాశించు చుండెనని ఇతిహాస (చరిత్ర) పరిశోధ కులు వ్రాయుచున్నారు. హలాయుధుడు-సింధుబల్లాలుడు-సిరియాళురై నను 5-6వ శతమానము వారై యున్నారు.

క్రీ.శ. 763లో నున్న నిజగుణ శివయోగులవారు, వీరశైవరాజులు వీరు వ్రాసిన ఆరు గ్రంథములు, ఆరు శాస్త్రములను పేరుతో ప్రఖ్యాతి గాంచినవి. వీరి కాలనిర్ణయమునందు భిన్నాభిప్రాయములున్నవి. వీరు అనాది సంసిద్ధులైన శ్రీ జగద్గురు పంచాచార్యుల విచారములను వివ

రించుటే గాకుండ 63 పురాతనుల స్తుతించుట వలన అరువదిమూడు మంది పురాతనుల తరువాతి వారనియు బసవేశ్వరుని కాలములోనియేశివ శరణుల విషయమును వివరించలేదు. కాబట్టి 63 పురాతనుల తరువాత బసవాది శివ శరణులకంటె పూర్వమె వీరి కాలమని ఊహించుటకు అవకాశమున్నది. అయినను వారి నిశ్చిత కాలమును గురించి పరిశోధింపవలసి యున్నది.

దేవరదాసిమయ్య :- ఇప్పటి కల్‌బుర్గి (గుల్బర్గా) జిల్లా సురపురు తాలూకాకు చెందిన ముదనూరు అను గ్రామమునందు శంకరి రామయ్య లను దంపతుల గర్భమున 1008 నుండి 1050 మధ్యన జన్మించిన దాసిమయ్య ముదునూరులోనే బాల్యమును గడిపి భూకైలాసమని ప్రసిద్ధి గాంచిన శ్రీశైల క్షేత్రములో ఆకాలమునందు మతోద్ధారక కేంద్రముగా ఖ్యాతిగాంచిన శ్రీ జగద్గురు పండితారాధ్యుల వారి సింహాసన పరంపరకు సంభంధించినట్టి శ్రీ చంద్రగుండ శివాచార్య మహాస్వాములవారు మహా మహిమోపేతులై, శివజ్ఞాన సంపన్నులై, శాపానుగ్రహ సామర్థ్యము గలవారై, విరాజిల్లుచుండిరి.

దాసిమయ్య ఆగురు సార్వభౌముల వారివద్దకు వెళ్ళి సాష్టాంగ నమస్కారము చేసి వారి అనుగ్రహమునకు పాత్రుడై, వారిచేత శివదీక్షా సంపన్నుండై. వారి అనుభవ మంటమునందు కొంతకాలముండి, వారి సాంగత్యము అనుభవ ప్రాబల్యముతో తనలో కలిగిన మార్పు (పరివర్తనము)కు తాను సంతసించి.

"ఉరివ కెండదమమేలె తృణవతందిరిసిదరె, ఆతృణవనాకెండ నుంగి దంతెగురు చరణదయె తనువెంబ తృణవతం దిరిసిదరె, ఆతన సర్వాంగ వెల్లలింగ కాణారామనాథ".

తా॥ నిప్పుపై యెండిన గడ్డి నివేసిన (ఉంచిన) ఆ గడ్డి నియానిప్పు కబళించినట్లు, గురుచరణముపై శరీరమును గడ్డి నుంచినచో నాతని సమస్త శరీరము లింగమయమే గదా ! రామరాధ అనినుడిని అటనుండి బయలు దేరి వచ్చునపుడు అరణ్య వాసులైన కిరాతకులకు సదుపదేశ మొసంగీ, లింగధారణ మొనర్చి, యటనుండి బయలుదేరి, వీరశైవ ధర్మోద్ధార కార్య క్రమమునందు ఆసక్తుడై, మార్గ మధ్యమున దారసిల్లిన, దేవాంగులకు నేతవారికిని, పటుకరి వారికి, శీలవంతులకు గురువనుగ్రహ మొనర్చిన పిదప దేహముపై సదా లింగ ముండవలెను. లింగము లేని గురుకారుణ్యము శుష్కించిన(ఎండిన) చెరువులోని తామరను (కమలమును) విత్తినట్లు అని బోధించి వారినందరిని, శివభక్తులనుగా చేసి, తరువాత నంది గ్రామములో నున్న ముద్దయ్యగౌడ (పటేల్) మున్నగు సమస్త రైతులకు శివదీక్ష నొసగి; శివపంచాక్షరీ మంత్రమును ఉపదేశించి అక్కడి నుండి ఆంధ్రదేశ మునకు సంబంధించిన "పొట్లచెఱువు" (పటాన్‌చెరువు)ను రాజధానిగా జేసుకొని, రాజ్యమును పరిపాలించుచున్న జయసింహరాజు ధర్మపత్నియగు సుగ్గలాదేవి మొదలగు అనేకమంది జైనులకు వీరశైవ ధర్మదీక్ష నొసగి, అచట ఒక కేంద్రమును స్థాపించి యట కొన్ని దినములుండి, అక్కడి నుండి ముదనూరు (మదనూరు)కు వచ్చి, అట వీరశైవ ధర్మ ప్రచార కేంద్రమును ఒక దానిని (అనుభవ మంటపమును) నెలకొల్పి, అక్కడే స్థిరపడి, తరువాత "దుగ్గళే" అను ధర్మపత్నిని వివాహ మాడి, వస్త్ర ముల నేత వృత్తిని చేపట్టి, శివానుగ్రహమునకు పాత్రుడై, అవసాన కాలము నందు మోక్ష పదవిని బడసిన మహా మహిమాశాలి.

ఇతడు కన్నడ భాషలో వచనముల రచించి యున్నాడు. అవి సంపూర్ణముగా లభించలేదు, కేవలము 108 వచనములు మాత్రమే లభించి యున్నవి. ఈతడు బసవాది శివశరణుల కంటె పూర్వమే

(150 సం॥ల క్రితమె) యుండెను. ఈతడే వచన కారులలో మొట్ట మొదటి వాడుగా పరిగణింపఁబడుచున్నాడు. ఇతని వచనము నుండి

"కరియా నిత్తడె ఒల్లె, సిరియ నిత్తడె ఒల్లె,
హిరిదప్ప రాజ్యవ నిత్తడె ఒల్లె॥

నిమ్మ శరణర సూళ్నుడియ, ఒందర గళిగె ఇత్తడె
నమ్మ నిత్తె కాణా రామనాథా॥

తా॥ ఏనుగు నిచ్చినను ఒల్లను, ధనము నిచ్చినను ఒల్లను, గొప్ప సామ్రాజ్యము నిచ్చినను ఒల్లను. మీ శివశరణుల అమృత (సత్య) వచనము ఒక అరనిముష మొసగిన చాలును.

అని తన వచనమును విశదపరచి యున్నాడు. పై వచనము నుండి ఇతని కంటె పూర్వమున కూడ శివశరణులు వచనకారులుండిరని తెలియుచున్నది. బసవేశ్వరుని మొదలుకొని సర్వజ్ఞకవి వరకు అనేకులు ఈతని వచనముల చేత ప్రభావితులైనట్లు తెలియుచున్నది. బసవేశ్వరుడైతె దేవర దాస్మయ్యను పలు మారులు స్మరించియున్నాడు.

వచనము :- భక్తియెంత హుందయ్య, దాసయ్య మాడి దంత
హుందయ్య, నెరెనెంబో, నెరెనెంబో, దాస దుగ్గళెయరంతె

తను, మన, ధనములందు వంచన యెడుగరయ్యె, దాసయ్య సిరియాళ ఇత్యాది భక్తులలో నాతనిని గౌరవముతో స్మరించుటే కాకుండ, వచన రచనలోను, అక్కడక్కడ ఆతనినే అనుసరించి యున్నాడు. కనుక దేవర దాస్మయ్య బసవేశ్వర జననము కంటెను మొదలే యుండిరని తెలియుచున్నది.

## -: సిద్దయ్య పురాణిక-శరణ చరితామృతము :-

వీరశైవ ధర్మము బసవేశ్వరుని కాలములో ఇంత బలపడుటకు దాసిమయ్య, కేసిరాజు. ఏకాంత రామయ్య వంటి శివశరణులు ఆతని కంటె పూర్వమే ఉద్భవించి. శివానుబవమును రాజ్యము నందు అభివృద్ధి గావించినదే. ముఖ్య కారణమని మనకు తెలియుచున్నది.

విద్యావారిధి, కర్నాటక భూషణ, కీర్తనాచార్య, సమాజ భాస్కర, ఆస్థాన విద్వాన్, పండితరత్న, పద్మశ్రీ బి. శివమూర్తి శాస్త్రి గారు, వీరశైవ సాహిత్య మరియు ఇతిహాసమున: భాగము 2 పుట 50, రంగనాథ రామచంద్ర దివాకర, M.A., LL.B. ధారవాడ గారు వచనశాస్త్ర రహస్యము 2వ.భా. పుట 213 నందు 150, అనుభావ పూర్ణమైన వచనములను రచించిన వచనకారుల మొదటి చరిత్ర మాత్రము ఇంకను మనకు నిశ్చయముగఁదెలియదు బసవన్ననే మొట్టమొదటి వచన కారుడనునది తప్పుడు విచారము, ఒకప్పుడు రూఢిలో నుండెను. అటువంటిదిప్పుడు వ్యవహారములో మృగ్యమై చాలాదినములు గడచినవి.

కవి చరిత్ర కారులు ఈ అభిప్రాయమును వ్యక్త పరచి యున్నారు. "తనకు ఒక అరఘటిక శరణుల సత్యవచన (అనుభవ పూర్ణమైన వాక్యము)ము నొసగినచో తనకు భగవంతుని దర్శనమగుట సిద్ధమే" అని ఇతను చెప్పియున్నాడు.

అతడే బసవేశ్వరుని కంటె మొదటివాడు. అతడు కొనియాడిన సత్యవచనములు అమృత వాక్కులే (వచనములే) అయిన యెడల ఆతని కంటె పూర్వమున నున్న అనేకమంది వచనకారులు ఉండియే తీరవలెను.

ఐఘటినూరు రామేశ్వర లింగమును వచనకారుడు క్రీ. శ. 1100 నందు ఉండవచ్చును అని కవి చరిత్రకారులు ఉట్టంకించి యున్నారు.

-: ప్రథమ వచన శిఖామణి-ముదనూరు :-

శ్రీ దేవరదాసిమార్యుల 108 షట్ స్థల వచనములు అను గ్రంధము, సంగ్రాహకులు శ్రీ జి. జి. ఘనమతేశ శివాచార్యులు సుక్షేత్రము ధవళగిరి (మైసూరు స్టేట్) ప్రకాశకులు :- జ॥ ప్రభుదేవ ధర్మప్రచార మండలి విరక్తమఠ, యెడ్రామి ఈ గ్రంధములో జి.జి. శివాచార్య ధవళిగిరి వారు ప్రస్తావనగా వ్రాసిన దేవర దాసిమయ్య బసవేశ్వరుని కంటే పూర్వము వాడనియు అనేక ఆధారములతో ఇప్పుడు తెలియు చున్నది. అని నుడివి యున్నాడు.

ఒకరిద్దరు బుద్ధిమంతులు ఈ దేవర దాస్మయ్యను గురించి బసవేశ్వరుని కాలము వాడనియు బసవన్నయే వచనశాస్త్ర ప్రవర్తకుడనియు, వీరశైవ మత సంస్థాపకుడనియు వ్రాసియున్నారు. పై వ్రాయబడిన రచయితలను చూచి అయినను వారు తాము గుడ్డిగా చేసిన తప్పును సరి దిద్దు కొనవలెను.

సకలేశ మాదరుసుడు బసవేశ్వరుని కంటెను 40-50 సం॥రాలకు పూర్వపు వాడనియు శ్రీ పి. జి. హళ్ళికట్టి గారు చెప్పియున్నారు. (సకలేశ మాదరసు 700 సం॥లు జీవించి యుండెననియు కాకినాడ శ్రీ బండారు తమ్మయ్యగారు సంశోధించి వ్రాసియున్నారు. అనగా బసవన్న కంటెను 650 సం॥లకు పూర్వపు వాడనియు, సకలేశ మాదరసు) అయితే ఈ సకలేశ మాదరసు గారి వచనములను వ్రాసియున్నారు. అవి కల్యాణమునకు రాక పూర్వమే వ్రాసినవో లేదా అక్కడి నుండి వచ్చిన తరువాత

వ్రాసినవో అనునది చెప్పుటకు వీలులేకున్నది. దేవర దాస్మయ్య బసవేశ్వరుని కంటె పూర్వపు వాడని శ్రీ హర్డేకర్ మంజప్ప గారు శ్రీ పి. జి. హాళకట్టి గారు ఉల్లేఖించి యున్నారు.

-: కొండ గుళికేశిరాజు :-

కల్బుర్గి (గుల్బర్గ) జిల్లాకు చెందిన జేవరిగి తాలూక "కొండ గుళి" అను గ్రామమున ఈ కేశి రాజు జన్మించెను. అక్కడాతని పేరుతో ప్రసిద్ధిగాంచిన దేవస్థానమిప్పటికి సాక్షిగా నిలచియున్నది. ఈ కేశిరాజు 11వ శతమానములో కల్యాణబిజ్జళునికంటె 50-60 సం॥ములకు పూర్వమున పేర్మాడి రాజ్యములో మంత్రియై, మహా మహిమాశాలియై అనుభవ మంటపమున, శరణగోష్ఠి, గురు-లింగ-జంగమంబుల ఆరాధనలో సాటిలేని భక్తిగలవాడై ప్రభుప్రేమకు బాత్రుండై, సమస్త మంత్రులలో ప్రధానియై, (ముఖ్యుడై) ప్రభావశాలియై, విరాజిల్లుచుండెను. మిగతి మంత్రులు ఈతని ప్రతిభను జూచి యోర్వలేక (ఈర్ష్యాళులై) మహారాజా! కేశిరాజు విశేషముగా అనుభవమంటపమున, శరణగోష్ఠి, గురు-లింగ-జంగమంబుల ఆరాధన యందె కాలక్షేపము జేయుచున్నాడు. మరియు నందిముద్రగల యుంగురము (అంగుళీయకము)ను ధరించి యున్నాడు. మీకు చేతులెత్తి నమస్కరింపక నంది యుంగరమునకే నమస్కరించుచున్నాడనియు మరియు ననేకవిధములైన చాడీలు (దుర్భాషలు) గరుపిరి, రాజు గూడ ఆ చాడీఖోరుల మాటలు విని కేశిరాజా! నీకు అనుభవమంటపమున-శరణగోష్ఠి జరుపడమే ఇష్టమైనచో నీవు వెంటనే నీ మంత్రి పదవికి రాజీనామ ఇవ్వవలసిందిగా కోరెను. ఒకవేళ మంత్రి పదవే నీకు ఇష్టమైన యెడల శరణుల సాంగత్యమును విడువుము అనెను. వెంటవే కేశిరాజు దన కిరీటమును, ఖడ్గముద్రగల యుంగరమును దీసి

రాజు ముందుంచెను. అది జూచి ప్రభువు ఆశ్చర్యముతో మంత్రిపుంగవా! రెండింటిని నిర్వహింపుడని ప్రార్థించెను. కాని కేశిరాజు దానికంగీకరించ లేదు. చాడీఖోరులు ఆ సంది ముద్రగల యుంగరమును అడుగుమని చెప్పగా తక్షణమే దానిని దీసి యిచ్చి నమస్కరించకుండానే వెళ్ళిపోవును. తరువాత రాజనేక విధముల బ్రార్థించినను మంత్రి పదవి నంగీకరించ లేదు. పిదప అక్కడే కొన్నాళ్ళు పరిసరములందుండి మరల స్వగ్రామము నకు వెళ్ళునపుడు నదిలో లింగార్చన జేయుచుండగా నాలింగము నీటిలోబడి మునిగి ప్రవాహమునందు కొట్టుకొని పోవును. అప్పుడు కేశిరాజు అనన్య భక్తితో బ్రార్థించగా లింగమూర్తి తానై వచ్చి కరకమలమునందలంక రించును, ఆ పిదప కొండగుళికి వెళ్ళి అక్కడే ఉండిపోవును. ఇతఁడు లింగార్చనా సమయమునందు

"అటమటదమాత నాడియే, తుటివాసుకలదేకె - జనన మరణార్ణవదా ।
తటమంశ్యార్చుతెప్పంధిటమిదే - కేశోన్నమశ్శివాయెంబ పదం ॥

అని యనేక పద్యములను (పదాలను) బాడుకొని యున్నాడు. (ఇతని చరిత్ర ప్రత్యేకముగా దిలకింపుము).

## -: శ్రీ జగద్గురు రేవణ సిద్ధేశ్వరులు :-

క్రీ. శ. 10-11-12వ శతాబ్దములలో శ్రీ జగద్గురు రేవణ సిద్ధేశ్వర మహాస్వాములవారు కర్ణాటక, మహారాష్ట్ర-ఆంధ్ర-తమిళనాడు మొదలగు ప్రదేశములందు సంచరించి అనేక ప్రజలకు లింగాధారణమొనర్చి, వీరశైవ దీక్షనొసఁగి, శివ పంచాక్షరీ మంత్రోపదేశమును గావించి, యుద్ధరించి యున్నారు. అవుతే కలియుగారంభమున లంగోద్భవులైన రేవణ సిద్ధేశ్వరులు మాత్రము వీరుగారు. ఆ పేరు గల స్వాములు అనేకులై

పోయినారు. వీరు 12వ శతమానములోని రేవణ సిద్ధేశ్వరులు, వీరు సొల్లాపురమునకు వచ్చి సుగ్గలాదేవి గర్భము నుండి యప్రతిమ మహిమో పేతుఁడైన" శివయోగి జన్మించును. ఆతనికి సిద్ధరాముడను నామకరణము జేయుమని భవిష్యత్తును సూచించి, హావినహాళు కల్లయ్యకు మరియు మడివాళమాచి దేవుని గురువులైన మల్లికార్జున స్వామికి గూడ శివదీక్ష

నొసఁగి రుద్రముని దేవునిచేతనుపదేశమిప్పించి బసవేశ్వరునికి మార్గదర్శకురాలైన అక్కనాగమ్మకు కల్యాణమునకామె విచ్చేయుటకు పూర్వమే చన్న బసవేశ్వరుని జననమునకు పూర్వమే ఇంగళేశ్వర గుట్టలో జ్ఞానోపదేశమునుజేసి యోగ మార్గము యొక్క సకీలములను దెలియపరచి యున్నారు. ఇప్పటికిని ఈ ఇంగుళేశ్యర గుట్టయందొక గదిలో రేవణ సిద్ధేశ్వరమూర్తి, దాని ప్రక్కనే ఉన్న మరో గవిలో అక్కనాగమ్మమూర్తి నేటికి విరాజిల్లుచున్నది. మొదలే కల్యాణ పురమున కొన్నాళ్ళు బసవేశ్వరుని మహాగృహము నందున్నట్లును ఆయిదక్కి మారయ్యగారి ప్రసంగము నందు బసవేశ్వరుడు వీరితోబాటె ఆయిదక్కి మారయ్య గృహమనకేగినట్లు (వీరశైవామృత మహా పురాణమునుండి) తెలియుటవలన వీరు కొన్నాళ్ళు బసవేశ్వరుని మహాగృహమునందు క్రియామూర్తియై యుండవచ్చునని తార్కాణమునకు తావున్నది. కల్యాణములో వీరి మఠమున్నట్లు దెలియు చున్నది. వీరు ఇంకను ననేక కార్యములను సల్పియున్నారు. ఈ సమస్త విచారములను వీరి చరిత్రలో సంపూర్ణముగా వ్రాయబడినది. దాన్ని జదివి చూడండి, ఆ కాలములో యోగ సిద్ధులైన రేవణ సిద్ధేశ్వరులు ఇంగళేశ్వర గుట్ట గుహ (గవి)లో అనుష్ఠాన మాచరించి, అచట కొంతకాలముండిరి, అటవారి బోధలువిన్న భక్తవృంద మేర్పడినది. నాగలాంబ గూడ వారి దర్శనమును బడసినది. తనలో నున్న సందేహముల నివారణకై శివాగమ శివ సిద్ధాంతముల విషయమై యామె వారితో చర్చించినది. పృచ్ఛించి

ప్రశ్నలకు దగిన సమాధాన ములను బొందిసది. ఆమె యొక్క తత్వ జిజ్ఞాసమునకు ప్రసన్నుండైన శ్రీ రేవణ సిద్ధేశ్వర శివయోగుల వారు ఆమెకు యోగ సాధనక్రమము నుద్బోధించిరి. నాగలాంబ అక్కడే సమీపముననున్న పరో గవిలో నాలుగు మాసములు క్రమముగా సాధన జేసినది. ఆ పిదప నాగలాంబకు విశాల దృష్టి యేర్పడి లోక కల్యాణము యొక్క ప్రజ్ఞనధికముగా నార్జించినది. వీనికంతటికి శివస్వామి దన కను కూలముగా వర్తించెను. అప్పుడు నాగ లాంబ యొక్క పేరు ప్రతిష్ఠలు నలు దిశలకు వ్యాపించినవి. (క్రాంతి గంగోత్రి-లక్కప్ప, శిరహట్టి)

సింగిరాజు పురాణములో వివరింపబడిన వివరములనుండి బసవేశ్వరుల వారి వృషభముద్రగల యుంగరము యొక్క కధను జదివినయెడల బసవేశ్వ రులవారు తమ చేతిప్రేలికి యెల్లప్పుడు వృషభ ముద్రగల యుంగరమును ధరించియుండిరని దెలియుచున్నది. (కొండగుళికేశి రాజువలె) ఒకసారి చాడీఖోరులు బసవేశ్వరుడు బిజ్జళునికి అలింగియని ఉపచారమునకు మాత్రమే నమస్కరించును. ఆ సమయమున తనచేతి ప్రేలుకున్న వృష భముద్రగల ఉంగరాన్ని తన నుదుటివైపునకు త్రిప్పుతాడని బిజ్జళునికి చాడి జెప్పుదురు. ఆ సమయమున వారు బిజ్జళునికి యుపదేశించునపుడు

"సిద్ధభిక్షక్కెబరలు కుక్కుళకు దివ కూళిక్కలాద పరిభవ సురగి యలిబళలిదుదనరిదొడె" అని రేవణ సిద్ధుడు వేడి పాయసమును భుజించిన కథ మరియు మాచనూరు మడుగులో సురగి కఠారి (ఖడ్గము) నుంచిన గాథలను విశదముజేయుటవలన ఈ రేవణ సిద్ధునిపై బసవన్న గారికి యపారమైన భక్తియున్నట్లు సుస్పష్టమైనది.

(సి.రా.పు.ప్ర. 164 సం॥ 14 పదము 14)

బలదేవ సిద్ధరసునకు సంబంధించిన పూర్వీకులు ఈ రేవణ సిద్ధేశ్వరునికి నడచుకొనుచుండిరి. తమ పూర్వీకుల వలెనె వీరును గౌరవించుచుండిరి.

బిజ్జళుని చరిత్రయనునది బసవప్పగారిని నిందించి వ్రాసినదొక కావ్యము, దానిలో బసవప్పగారు బిజ్జళుని వద్దకు భిక్షార్ధమై కపటవేషముననున్న ఒక జంగముని పంపించి యుండిరనియు అతడక్కడికి వెళ్ళి తాను కైలాసమునుండి విచ్చేసిన మాయా కోలాహల రేవణ సిద్ధుడినని చెప్పి యున్నాడనియు వ్రాయుటను దిలకించినయెడల, ఆ కాలమునందును (వీర శైవ మతాచార్యులైన) రేవణసిద్ధుని ప్రభావము సుప్రసిద్ధమైనదని దెలియుచున్నది.

రేణుకుడు-రేవణ సిద్ధుడను వారొక్కరేయని బహు జనులు గుర్తించి యున్నారు. కాని వీరుభయులు ఒక్కరేగాక వేరువేరుగానున్నారు. ఆదియందు పరమ శివుని సద్యోజాతముఖము నుండి యుద్భవించినవారు శ్రీ రేణుకాచార్యులు, వారు కృతాయుగమునందు ఏకాక్షర శివాచార్యులనియు, త్రేతాయుగములో ఏకవక్త్ర శివాచార్యులనియు, ద్వాపారములో రేణుక శివాచార్యులనియు, కలియుగమున రేవణారాధ్యులనియు, రేవణసిద్ధ శివాచార్యులనియు ప్రసిద్ధులైయున్నట్లు ఈ పూర్వమే వివరించనైనది. కాని రేణుక, రేవణసిద్ధ, రేణుకాచార్య, రేవణారాధ్య మున్నగు నామములు ఒకే అర్థమును స్ఫురింపజేసినను ఆ పేరుతో నున్న స్వాములు ఆ పీఠము నందనేకులుండి వెళ్ళియున్నారు. అంతెగాకుండ వీరు పర్యటించిన స్థలము లన్నింటా రేవణసిద్ధగవి, రేణుకతీర్థ రేవణసిద్ధేశ్వరబెట్ట (గుట్ట) రేవణసిద్ధ క్షేత్రమని భారతము నందంతట విరాజిల్లుచున్నవి. యెయే యుగములలోనివని నిర్ణయించుట కష్టసాధ్యముగా నున్నది. కనుక ఆ పేరుగల స్వాములు

ఎందరో ఎన్నియో మహత్వములను ప్రదర్శించి యున్నారు. వాటి నన్నింటిని నిష్కల్మష హృదయముతో ప్రయత్న పూర్వకముగా పరి శోధించుట ప్రతి యొక్క వీరశైవుని కర్తవ్యమై యెన్నది.

దారుకాచార్యుని పేరు వరాహకల్పము సప్తమ మన్వంతరములలో యుగ క్రమముతో వివరింపఁబడియున్నారు. ఉత్తర ప్రదేశమున ఉజ్జయిని లోనున్న పీఠము కారణాంతరములచేత క్రీ. శ. రెండవ శతమానములో దక్షిణ దేశములోని యుజ్జయిని క్షేత్రమున మరుల సిద్దేశ్వర (సిద్దేశ్వర) శివాలయము నిర్మింపఁబడియున్నది.

ఏకోరామారాధ్యుల, పండితారాధ్యుల మరియు విశ్వారాధ్యుల వారి చరిత్రలు పరిశోధించి ప్రత్యేకముగా వ్రాయవల్సియున్నది.

## బ స వే శ్వ రు డు

జగన్మాన్యుండైన బసవేశ్వరుని గురించి యనేక కవులు పురాణము లను, ఇతిహాస కారులు చరిత్రలను వ్రాసి (రచించి) యున్నారు. కాని బసవన్న గారి నిజమైన చరిత్రను ఇదమిద్ధముగా (ఇట్లె) ఉండెనని గట్టిగా నిర్ణయించి చెప్పుట నేటికిని యసాధ్యమై యున్నది. చరిత్రనే గాకుండా కాలమును గూడ ఖచ్చితముగా నిర్ణయించుట యసంభవమే, కీ. శ. 1106, 1113, 1117, 1123, 1131, 1125, ఇట్లే వేర్వేరుగా రచించి యున్నారు.

కీ. శ. 1131లో విజాపూర్ జిల్లాలో ఇంగళేశ్వర్ బాగె వాడి యందు సుప్రతిష్ఠిత శైవ బ్రాహ్మణ కుటుంబములో మాదరస - మాద లాంబికల గర్భశుక్తిక యందు నందీశ్వర వ్రతము నాచరించుట వలన

ఈతడు జాతి ముత్యమువలే బుట్టగానే కప్పడి సంగమక్షేత్రనివాసియైన శ్రీజాత వేద మునీశ్వరుని వలన లింగధారణ, మంత్రోపదేశమును బొంది శివభక్తి - శివపూజలే మూర్తిగా నేర్పడినట్లు దినదినాభివృద్ధి గాంచి 8మిదవ ప్రాయములోనే తండ్రి జేయుంచునట్టి ఉపనయన కార్యమును నిరాకరించి కూడల నంగమ క్షేత్రమునకు వెళ్ళి అక్కడ తన జనన కాలపు గురువైన జాత వేద గురువుల వారి గురుకులము నందు 16, పదహారు సం॥ముల వరకు విద్యార్జన జేసికొని వేదాగమోపనిషత్తు పురాణేతిహాసాదు లందు ప్రవీణుడై శాస్త్రజ్ఞాన సంపన్నుడై గురువుల ఆజ్ఞాను సారముగా కల్యాణ పట్టణమునకు వచ్చి మేనమామగారైన బలదేవ, సిద్ధరసు పుత్రిక లైన గంగాంబ, నీలాంబికలను వివాహమాడి తరువాత బిజ్జల రాజు యొక్క ప్రధాన మంత్రి పదవి నలంకరించి, తన గురువైన జాతవేద మునీశ్వరుని యానతిసిదలదాల్చి, వీరశైవ ధర్మోద్ధార కార్యక్రమమున నిరతుడై తన కంటెను పూర్వ కాలమున ప్రచారకులని ప్రసిద్ధి గాంచినట్టి రేవణ సిద్ధేశ్వర మొదలగు నాచార్యుల, కలిగణ నాధాది పురాతనుల దేవర దాస్మయ్య, శంకర దాస్మయ్య, కొండగుళి కేశిరాజు, మొదలగు శివ శరణుల ఆదర్శ మార్గమునే అనుసరించి అనుభవ మంటపమును ఏర్పరచి, చన్న బసవేస్వర, అక్క నాగమ్మ గారి నుండి సంగమ క్షేత్రమునందే ఆరంభించినట్టి వచన రచనా వాహినీ యొక్క ప్రవాహమును పొంగి పొరలునట్లు జేయగా అద్దాని కాకర్షితులై నలువంకుల నుండి తండోప తండాలుగా శరణ సమూహము విచ్చేసి కల్యాణ మహా గృహము యొక్క అనుభవ మంటపమున జేరి వచన శాస్త్రమను కుంభ వర్షమును కురిపించిరి, వారిలో ప్రభు దేవులవారు, మడివాళ్ళ మాచి దేవుడు, అక్క మహాదేవి, మోళిగేయ మారయ్య, (కాశ్మీరపు రాజగు మహాదేవనృపతి) అయిదక్కి మారయ్య, హడపద అప్పణ్ణ, సకలేశ మాదరసు, మొదలగు ఇంకను ననేక శివశరణులు విచ్చేసి ప్రభావ పూర్ణమైన వచశాస్త్రపు

జయభేరిని మ్రోగించిరి, దీనితో నందీశ్వరావతారి యైన శ్రీబసవేశ్వరుఁడి కీర్తి ప్రతిష్ఠలు దశదిశలయందు వ్యాపించెను.

దిక్కుదిక్కుల నుండి లక్షల సంఖ్యలో వరశైవులు వచ్చి కల్యాణ పట్టణమున జేరిరి, ఎవరి నోట వినినను అన్న బసవన్న బసవ తండ్రి, బసవదేవా! బసవరాజా! అను హర్షోద్గారపూరితమైన ధ్వనులే బయల్వెడలుచుండినవి, బసవన్న గారి కార్యకలాపములు గూడ అప్రతి మానమైనవిగా నుండినవి, స్త్రీ స్వాతంత్ర్యము, బాల్య వివాహాది నిషేధము, సమతా భావము, జాతి భేదములను నివారించుట, బ్రాహ్మణులు మొదలు కొని అంత్యజులు చివరిగాగ సమస్త జనులకు శివదీక్షా సంస్కారము. ఏకీకరణాది యద్భుత క్రాంతి విప్లవమును జూచి మంచణ్ణాది చాడీఖోరులు బిజ్జల రాజునకు బసవేశ్వరుని గురించి యనేకమైన సందలను జెప్పఁ డొడగిరి, అదే సందర్భమున హరళయ్య, మధువరసుల బాంధవ్య ప్రకరణముతో బసవేశ్వరునిపై బిజ్జళునకు అంతులేని కోపము వచ్చెను, ఇట్టి పరిస్థితిని గమనించిన బసవన్న అక్కడి నుండి బయల్వెడలి సంగమ క్షేత్రమునకు బోయి సంగమనాథునిలో నైక్యమొందెను.

మొత్తముపై బసవేశ్వరుని జీవితము 36 సం॥ములు, బాల్యమున 8 సం॥ములు బాగేవాడిలో, తరువాత 16, సం॥ములు, సంగమ క్షేత్రములోను, చివరికి 12 సం॥ములు కల్యాణము నందు ఈ విధముగా బసవన్నగారవతరించి జీవితయాత్రను సాగించి తమ యవతారమును ముగించిరి.

## హరిహరకవి మతము బసవన్నగారి జననము

శివుని యాస్థానమున [కైలాస సభలో] వృషభ ముఖుడను ప్రమథ గణుడు ప్రసాదమును వితరణమును [పంచునపుడు] జేయునప్పుడు

షణ్ముఖునకిచ్చుటను మరచి యిచ్చితిననియు యసత్యమును బలుకుట వలన శివుడాతనిని గురించి భూలోకమున నీవు బసవడను నామముతో జన్మించి యిచట ప్రసాద మిచ్చుట మరచిన దాని ఫలితముగానట [భూలోకమున] ప్రసాదమును ప్రతివాది చేతబడసి ప్రమథ గణముల సమక్షమున.

"పుసిగె శరణర్గె మాడుత్తె, అణియరదొళెన్న భక్తి యనిశేగె కొడుత్తె ఎన్న ప్రసాద సామర్థ్యమంతో రుతం పన్నణె యొళిల్లి గైతర్పు దిదు నిర్మితం" అని శివుడాజ్ఞాపించును.

సుప్రసిద్ధి జెందిన కర్నాటక ధర్మ వీరులలో బసవన్నగారొక్కరు, వారు మొదట బ్రహ్మణుడై యుండి పిదప బ్రాహ్మణ్యమును నిరాకరించి వీరశైవ ధర్మమును ఆశ్రయించి తమ జీవిత సర్వస్వాన్ని ఆధర్మము యొక్క ఉద్ధారమునకై ధారబోసి యున్నారు. తాము స్వతః పరమనిష్ఠా గరిష్ఠులైన శివభక్తులై యుండి యనేక పవాడము [మహిమ] లను ప్రదర్శించుటే గాకుండ జంగమారాధనకుగాను, ధర్మ ప్రచారమునకుగాను, కృషి సల్పి వీరశైవ ధర్మోద్ధారకులలో నగ్రగణ్యులైరి.

[హరిహర కవి బసవ రాజు దేవర రగడలో, V. S. వెంకయ్య] శ్రీ బసవేశ్వరులవారి ఎనిమిదవ శతమానోత్సవమును బసవ కల్యాణములో ఆచరించినపుడు శ్రీమన్మహా రాజు నిరంజన జగద్గురు శ్రీ గంగాధర రాజ యోగీంద్ర మహాస్వాములవారు మూరుసావిరమఠ హుబ్బళ్ళి, వారుపన్య సించిన అధ్యక్షీయ భాషణ [ఉపన్యాసము].

వచన వాఙ్మయమునకు బసవన్నగారే పురస్కర్తలు, అథవా వచన వాఙ్మయాచార్యులనినను తప్పుగాదు బసవన్న గారి కంటె పూర్వము

కొందరు వచనములను రచించినను వచన వాఙ్మయాన్ని అభివృద్ధి పరచిన వారిలో వీరే మొదటివారు, అవియు.

వేదాగమోపనిషత్తుల యొక్క సారాంశమునే ఈ సులభమైన కన్నడ భాషలో జెప్పి మానవుని హృదయము కరుగునట్లు జేసి, కల్యాణమునకు అందరు వేంచేయునట్లొనర్చి, కల్యాణ మార్గమును జూపునట్టి అధ్యాత్మిక జ్యోతియై ప్రకాశించిరి.

ఇహలోకములోని కుందు కొరతలను [లోప దోషములను] సంపూర్ణముగాని యాశయములను పూర్తిజేయుటకై ముందట మరో లోకముంది, అని భావించునట్టి మాయా నిరసనను వ్యక్త పరచుటకై యత్నించగా వీరశైవ ధర్మోద్ధారకులైన మహాత్మ శ్రీ బసవేశ్వరులవారు వీరశైవ సిద్ధాంతమున నిమిడియున్న భక్తి-జ్ఞాన-వైరాగ్యముల-త్రివేణి సంగమమునకు ఒక శాశ్వతమైన రూపు రేఖలను తీర్చిదిద్దుటకై శివానుభవ మంటపమును నెలకొలిపిరి.

అమరవాణి ఉజ్వల మాస పత్రిక ఫిబ్రవరి-మార్చి **2-3-1968.**
సంపాదకులు : బి.ఎం. వీరేశ్వర శాస్త్రీ విద్వాన్ గారు.
ఉప సంపాదకులు : డా॥ S. M. హుణిశ్యాళ, M.A.Phd.,
సహా సంపాదకులు : ప్రో. వి. శివానంద, M.A. గారు

బసవేశ్వరుని తల్లి మాదలాంబ ఇంగళేశ్వరబలదేవుని సోదరి, ఆ యింటి వారు శ్రీ రేవణ సిద్ధేశ్వరుని ప్రభావలయమునకు చిక్కి సహజ భక్తికి ఆలవాలమై యుండవచ్చును. తండ్రి యింటికి వచ్చినచో కర్మనాచరించుట, తల్లి గారింటికి వచ్చినచో ధర్మము నాచరించుట, ఈ రెంటి యనుభవము బసవేశ్వరునికి అప్పుడప్పుడు గుర్తుకు వచ్చుచుండేదేమో.

ధర్మగ్రుల విభూతి పురుషులు : కార్తికేయ ప్రకాశన విశ్వధర్మ ప్రతిష్ఠాపకులు, వీరశైవ ధర్మోద్ధారకుడు, భక్తి యుగమున కాచార్యుఁడు కల్యాణ శ్రీ బసవేశ్వరుల వారు (పద్మశ్రీ బి. శివమూర్తి శాస్త్రి గారు బెంగళూరు) సుమారు వేయి సం॥ములకు బూర్వమున శ్రీ శరణముద్భూరు, దేవరదాసి మార్యులచేత ప్రప్రథమున నిర్మితమైన వచన సాహిత్య వాహిని యెనమిది వందల సం॥ములకు బూర్వమున ప్రపంచపు మానవులనుద్ధరించు టకై పరమాత్ముని యాజ్ఞాను సారముగా భువికవతరించి వచ్చిన వీరశైవ ధర్మోద్ధారకుడైన భక్తి భండారి శ్రీ బసవేశ్వరుని సమయమున అత్యంత వేగముగా ప్రవహించి బహు సంఖ్యాకులైన వచనకారులు, వచన కవయిత్రిణులు జన్మించి రెండు యెణుభై కోట్ల వచనములు రచించబడిన వనియు శ్రీ భగవాన్ బసవేశ్వరుడే నుడివియున్నాడు, ఈ బృహత్తరమైన సాహిత్య దృష్టి విశ్వ సాహిత్యము వందే అతి విరలమని దెలియుచున్నది.

శ్రీ పం॥ గురుసిద్ధ శాస్త్రిలు (కావ్యతీర్థ) రామగిరి.

## హిరేమఠ యాదగిరి గారు

కొందరు వ్యక్తులు చేతి వ్రేళ్ళపై లెక్కించే విధముగా బసవేశ్వరుడే మత స్థాపకుఁడని వ్రాసియున్నారు. ఈ ప్రకారముగా యుగ యుగముల నుండి సాంప్రదాయ సిద్ధంగా వచ్చియున్న వీరశైవ ధర్మమును బసవన్ననే స్థాపించి యున్నాడనుటను కాస్త పరిశీలించినచో చాలా ఆశ్చర్య పడక తప్పదు. బసవన్నగారు ఈ ధర్మమును జీర్ణోద్ధారము జేసినాడని చేబితే ఆ మహాత్మునికేమైన లోటు (కుందు) రాగలదని యూహించి కాబోలు ఇట్టి జనులు భావించుచున్నారు, అట్లు భావించుట చాల పొరపాటు. (శుద్ధ తప్పు) వీరశైవము అనాది సంసిద్ధముగా వచ్చి యున్నను బసవన్న

గారిచేత జీర్ణోద్ధారము జేయబడకుండిన యనేక యనర్ధములకు లోనగు చుండెడిదని చేప్పుటకే మాత్రము సందేహములేదు, నేడు బసవేశ్వరుని కున్నంత ప్రతిభ మరే ఇతరులకు లేదనిన యతిశయోక్తి గాదు. కావున ఎవరు గూడ సత్యాంశములను మట్టు పెట్టుటకు (మరుగు పరచుటకు) సాహ సించ గూడదు. అత్యంత సంశోధక ధురీణులైన శ్రీ హర్డేకర్ మంజప్ప గారే మున్నగు కొందరు సుప్రసిద్ధ పురుషులు చాలా అభిమానముతో వీరశైవ మతోద్ధారకులలో మహాత్మ బసవన్న గారే చివరి వారని వ్రాసి యున్నారు. వీరందరి విచారములను ఇక్కడ విశద పరచినచో నదే ఒక ఉద్గ్రంథ మగుననుటలో సంశయించ నవసరములేదు. కావున ఆ విషయమును గురించి ప్రత్యేకముగా "భక్తికి బీజము బసవేశ్వరుడు" అను గ్రంథమును ప్రకటించి యున్నారము. దయజేసి దానిని జదువండి.

## అక్క నాగమ్మ

బసవన్న గారి సోదరి అక్క నాగమ్మ (ఈ మేరకు సంబంధించిన పుట్టు బూర్వోత్తరములు నేటికి సరిగ్గా దెలియవు) ఈమెను సాక్షాత్తుగా పార్వతి దేవి చిత్కలయని చెప్పియున్నారు. ఈమె భర్త పేరు శివస్వామి, బసవన్నతో బాటు ఈమెగూడ సంగమ క్షేత్రమున జాత వేదముముల ఆశ్రమమునందు శివదీక్షా సంస్కారమును బడసి శ్రీ రేవణ సిద్దేశ్వరునితో శివ యోగము యొక్క సకీలములను దెల్సికొని ఇంగళేశ్వర గుట్టలో భర్తతో బాటు కొంత కాలముండి సంగమ క్షేత్రమునందే శ్రీ చన్న బసవన్నకు జన్మ మొసఁగి ఆ తరువాత భర్త పుత్రునితో గలిసి బసవన్నతో బాటు కల్యాణమునకు వచ్చి కల్యాణ క్రాంతి సమయమున బసవేశ్వరుడు సంగమ క్షేత్రమునకు వెళ్ళిన బిదప చన్న బసవన్నతో తాను ఉళవి క్షేత్రమునకు బోయి అక్కడే "ఎణిహాళె"య తీరము నందున్న ఆశ్రమ ములోనే ఐక్యమగును.

# చన్న బసవేశ్వరుడు

సంగమ క్షేత్రము నందే జన్మించి జాతవేద మునీశ్వరుని ఆశ్రమ ముననే శివలింగ ధారణ దీక్షను, విద్యార్జన, జేసి పండ్రెండేండ్ల వయసు నందే సమస్త విద్యలను ఆకళింపు జేసికొని తల్లిదండ్రులతో గలిసి బసవేశ్వరునితో బాటు వచ్చి కల్యాణ పట్టణమునందే బసవేశ్వరుడు బూను కొన్న వీరశైవ ధర్మోద్ధార కార్యక్రమములలో సహాయకుడై యనేక వచన రచన లొనర్చి "కరణ హసిగే" మున్నగు గ్రంథములను రచించి కల్యాణ క్రాంతి తరువాత ఉళివికి శరణ సమూహాముతో గూడుకొని వెళ్ళి యా ఉళివిక్షేత్రమునందేశివైక్యముఁజెందిరి.

ప్రతి సం॥ము మాఘ శు॥ 15కి, జాత్రా మహా ఉత్సవము జరుగుచున్నది.

అయితే చన్న బసవన్న గారిని షట్‌స్థల చక్రవర్తి యనియు, షట్‌స్థల సంస్థాపకులనియు. కొందరు జెప్పుకుంటూరు. కాని మగ్గెయ మాయి దేవుడు రచించిన అనుభవ సూత్రములో మరియు వాతూలాగమము లోను షట్‌స్థలమును గురించి నిరూపించబడినదని చేప్పఁబడినది. ఆగమములు వచనముల కంటెను అతి ప్రాచీన కాలములో వ్రాయబడి వమటు నిర్వివాదాంశము, ఆగమ ప్రామాణ్యములను వచనకారులు అను సరించి యున్నారు. ఆ కారణముచేత షట్‌స్థలముల యొక్క ఉద్ధారకుడు చెన్న బసవన్న యని చేప్పవచ్చునేగాని, ఈతడే వీటికి మూల పురుషుడు అమట సమంజసమైన విషయము గాదు.

(వీరశైవ సాహిత్యము మరియు ఇతిహాసము భాగము-2)
(పద్మశ్రీ శివమూర్తి శాస్త్రి బెంగళూరు)

# అల్లమ ప్రభుదేవుడు

బళ్ళిగావి (బెళగాంవ్) నగరములో నిరహంకార సుజ్ఞాని అను
దంపతులకు అల్లమ ప్రభు జన్మించును. ఈ బళ్ళిగావి బనవాసి దగ్గర
ఉండెడిదని ప్రభులింగ లీల అను గ్రంథమునుండి దెలియుచున్నది,
దంపతులిద్దరు శైవ బ్రహ్మణ వంశస్థులని శివతత్త్వ చింతామణి,
అను గ్రంథము నుండి దెలియుచున్నది, అల్లముఁడు బాల్యము నుండియు
వైరాగ్య శీలుఁడు, శివభక్తి సంపన్నుఁడునైయున్నాడు. నిజమె కాని
హరిహర కవి వివరణమును బట్టి వారు యవ్వనావస్థలో నున్నప్పుడే
బళ్ళిగావిలో కామలతా యను యువతితో పలు సం॥ముల వరకు ఆనంద
మయముగా జీవితాన్ని గడిపెను, ఆ యువతి జ్వర పీడితురాలై మరణించగా
ఆతఁడు పరమ వైరాగ్యమును (విరక్తిని) బొంది దేశ పర్యటన జేయఁ
దొడగెను. ఒకనాడు అతఁడు భూగర్భము శివాలయములో
నున్న అని మిషుడను శివయోగి చేత శివ లింగమును బొందును.
ఆ శివయోగి సందర్శనముతోను, శివ లింగ సంపర్కముతోడను, యోగగా
భ్యాసము సామర్థ్యము చేతను, అతఁడు దివ్య జ్ఞానియై యసాధారణ
వ్యక్తి యని ప్రసిద్ధి కెక్కెను, ఇతఁడు అందరివలె చీకటిలో పరిభ్రమి
స్తూనె దివ్య ప్రకాశమును గనుగొనెను, పుట్టుకతో దివ్యజ్ఞాని గాని,
యోగ సిద్ధుడు గాని, కాలేదు. ఇట్లుండియు కొందరు ఇతఁడే నిరంజన
పీఠము స్థాపకుడనియు, వీరశైవ ధర్మ ప్రవర్తకుడనియు చెప్పుచున్నారు,
ఇది యధార్థమైనది గాదు.

అట్టి నిరంజన పీఠము జగద్గురు పంచాచారులలో ఒకరైన
ఏకోరామారాధ్యుల వారి చేత ప్రాచీన కాలము నందే హిమాలయ పర్వతము
నందు స్థాపించ బడినదనియు విదితమగుచున్నది.........ఆ నిరంజవ

తత్వ్యమును అనుసరిస్తూ వచ్చిన అల్లముఁడు శూన్యములో శూన్యుండైనను నిరంజన స్వరూపము యొక్క దివ్య జ్యోతియై నేటికిని సమస్త జనుల హృదయములందును విరాజిల్లుచున్నాడు ప్రాచీన కాలము నుండి యనేక మంది యోగులు అనుష్ఠించి జూపిన వీరశైవ సాంప్రదాయ స్వరూపమును అల్లమ ప్రభువు తన యొక్క ఆచరణ చేత అందరికి వారి వారి యోగ్యత కనుగుణ్యముగా హితముగా బోధించి యున్నాడనుటే ఆతని వచనముల నుండి సుస్పష్టమగుచున్నది, కావున అల్లమ ప్రభును వీరశైవ సాంప్రదాయ ప్రవర్తకుడనుట సమంజసమైనది గాదు.

ఈ కార్యమును రేణుకాది పంచాచార్యులు చాలా కాలమునకు పూర్వమే జేసి యున్నారు, ఇది లోకములో సుప్రసిద్ధమైన విషయము, "గురు లింగ జంగమంబులలో నేక రూపము. ఇష్టలింగమున ప్రాణ భావము, సమస్త జీవుల యందాత్మీయత, లింగ ప్రత్యర్థము కొరకే సమస్త వ్యవహారముల నిర్వహణము. సమస్త భోజ్య వస్తువులందును ప్రసాద భావన, ఇవి వీరశైవుల సాంప్రదాయములో ముఖ్యములైన రూపు రేఖలు, ఇవి చాలా పూర్వ కాలమునందే అనగా ద్రావిడ సంస్కృతిక మూల పురుషుఁడైన అగస్త్యుని కాలమునందె శ్రీ రేణుకాచార్యుల చేత నుపదేశింపఁబడినవై యక్తిక ఆచరణలో నుండినవి, దీనిని అల్లమ ప్రభు సామూహికముగా అందరకు ఆచరణమునకు సులభముగా లభించునట్లు తన ఆచరణతో జూయించి సాధకులకు అమోఘమైన సేవను సల్పి ఉత్తమమైన మార్గదర్శకుడై యున్నాడు.

ఇట్లుండియుఁ చన్న మల్లికార్జునుడు అష్టావరణములలో జంగమ అను పదము చిత్ర దుర్గము యొక్క బృహన్మఠము మొదలగు విరక్త

మఠములకు స్వాములై యుండి వారే సమస్త వీరశైవులకు ధర్మబోధ నొసరించుచున్నారు, అని వ్రాయుట వారి తప్పు కల్పనగా నున్నది. ఈ చిత్ర దుర్గము మఠము శూన్య సింహాసనమేమో నిజమే, కాని అల్లమ ప్రభువుకు ఈ మఠమునకు ఎటువంటి సంబంధములేదు. ఎంతో కాలమునకు బూర్వమే జగద్గురు శ్రీ ఏకోరామారాధ్యులవారే ద్రాక్షరామము లింగము నుండి యుద్భవించి కేదార క్షేత్రమున వైరాగ్య పీఠమును [నిరంజన జంగమ పీఠమును] స్థాపించియున్నారో. అట్టి నిరంజన జంగమ పీఠము యొక్క శాఖా మఠమే చిత్ర దుర్గము మఠమై యున్నది. ఇది అల్లమ ప్రభువు సాంప్రదాయ మఠము గాదు. కొన్నాళ్ళ క్రితము చిత్ర దుర్గపు మహా స్వాములవారు తమ లేఖలో [లెటర్ప్యాడు పుస్తకమున] ద్రాక్షరామ లింగోద్భవమనే పదమును జేర్చి వ్రాసికొను చుండిరి, చెన్న మల్లికార్జున స్వాములవారు గూడ స్వీయ చరిత్ర 400వ, పుటలో ఈ దిగువ దెల్పిన విధమున వ్రాసియున్నారు. ఇటు ఏకోరామా రాధ్యులవారి పీఠమే [కేదార పీఠమే] శూన్య సింహాసనమని అను (అనుస్యూతముగా) క్రమముగా వచ్చిన దృష్టాంతరమును కొంచెముగా చూచాయగా జూపియున్నారు. వాస్తవ విషయమిట్లుండగా అల్లమ ప్రభువే నిరంజన పీఠము యొక్క సంస్థాపకుడని వారి పరంపరగా వచ్చిన విరక్త మూర్తులే అష్టావరణములలో జంగమ పదవాచ్యులని చేప్పుట దురాగ్రహ పూరితమైన ఉక్తియేసరి.

అల్లమ ప్రభు బసవేశ్వరునికి సమకాలీనుడనునది అందరికి దెల్పిన విషయమే, వారుభయులకంటెను బూర్వమునందే జగద్గురు పంచాచార్యుల నుండే వీరశైవ ధర్మము స్థాపింపఁబడినదని యాధర్మమును ఆశ్రయించి యున్న జంగములు [మహేశ్వరులు] నాటి నుండి యున్నవారేనని సంస్కృత బసవ పురాణమే ఘంటా పథముగా చాటుచున్నది.

ఇట్లనేక గ్రంథాధారములతో, శాసనాదులచేత, అరువది మూఁడు మంది పురాతనుల వలన, దేవర దాస్మయ్య, ఏకాంత రామయ్య, కొండగుళ కేశిరాజు, మొదలగువారి కాలమున జంగములు [వీరమాహేశ్వరు]లున్న విషయమును దెలిపి పండ్రెండవ శతమానము కంటెను బూర్వమే జంగమ శబ్దముండినట్లు సమర్థించి యున్నారు, అనేక శిలా శాసనముల ఆధారముల వలనను, సంపూర్ణ విషయమును వీరశైవ పంచాచార్యుల చరిత్ర యొక్క విమర్శ అను గ్రంథమును జూచి తెల్సికొనుడు.

అల్లమ ప్రభు శివ యోగమును అనుష్ఠించుచు మహా యోగియని దేశములో ప్రఖ్యాతి గాంచెను. కాని యాకాలమునందు బనవాసి ప్రదేశము శివశరణులకు కేంద్ర స్థానమై వెలిసినది, అచట, లనిమిషయ్య, రేవణ సిద్ధుడు, మరుళ సిద్ధుడు, మున్నగు శివానుభవు లెల్లరు సుప్రసిద్ధులై యుండిరి, అల్లమ ప్రభువు అక్కడున్న ఈ శివానుభవుల సాన్నిధ్యము మూలమున [ద్వారా] అమరగణాధీశ్వరుల తత్త్వములను చక్కగా నవగతము జేసికొని యుండిరి.

ప్రభు దేవుల వారి విషయమునను భిన్నాభిప్రాయములున్నట్లు గమనింపుడు, [హరిహర] ఒకనాడు శివసభలో నిర్మాయుఁడను గణేశ్వరుఁడు ఒక దేవాంగన పరస్పరముగా వ్యామోహితులైనది గమనించి శివుడు భూలోకమునందు జన్మించి మీ మనోభిలాషను పురాయించుకొని రండని బంపగా నిర్మాయుఁడు అల్లయ్య అనియు, దేవాంగన కామలత యనియు, జన్మించి సుఖలోలు పురగు నపుడు, అకస్మాత్తుగా కామలత మరణించగా, అల్లయ్య దిగ్భ్రాంతి జెంది [పిచెత్తి] భ్రమించుచుండగా ఒకనాడు ఒక క్షేత్రమున గూర్చొని చేతో భూమిని గుంటగా జేసెను, అక్కడొక స్వర్ణ కలశము అగుపడగా. అ సంగతి రాజుకు నివేదించెను. రాజు అచ్చోట

ప్రవించగా భూగర్భము నుండి గొప్ప దేవాలయమే బయల్పడినది. చాలా కాలము నుండి తలుపులు మూసి భూగర్భములో మరుగునబడి యున్న మందిరములో ప్రవేశింప ఎవరికి ధైర్యముగాలేదు, అల్లయ్య ధైర్యముతో తలుపులు దెరచి లోనికి ప్రవేశించును, అక్కడ అనిమిషయ్య అరచేత నున్న లింగమూర్తి యందు దృష్టిని నిల్పి, బాహ్య ప్రపంచాన్ని మరచి యుండెను, అల్లయ్య అది జూచియా అనిమిషయ్య హస్తములో నున్న లింగమును దాను దీసికొనెను, వెంటనే అనిమిషయ్య ప్రాణపక్షి యెగిరి పోయెను, అనియు అల్లయ్య కప్పుడు జ్ఞానోదయము గల్గి తక్షణమే గొప్ప మహిమా శాలిగా మారి అల్లమ ప్రభువను పేరుతో వెలుపలికి వచ్చేసనియు అటనుండి జక్కగా కల్యాణ పట్టణమునకు విచ్చేసెననియు, చన్న బసవన్న గారికిని, ప్రభు దేవుల వారికిని, జరిగిన సంభాషణము గలదు.

(శివగణ ప్రసాది మహదేవయ్య గారి శూన్య సంపాదనములో)

## మోళిగేయ మారయ్య

కాశ్మీరము మహాదేవ భూపాలుఁడు ధర్మపత్ని యగు గంగాదేవితో బాటు కల్యాణమునకు వచ్చి మారయ్య మహాదేవి అను పేరుతో కల్యాణము వెలుపల మైదాన ప్రదేశములో నొక కుటీరమును నిర్మించుకొని తమ మొదటి చరిత్ర ఎవరికిని దెలియకుండ నివసించి యుండిరి. [అని యనేక గ్రంథముల నుండి దెలియుచున్నది] బసవన్న గారు కాశ్మీరము నుండి ఆరువేల జంగములను కల్యాణమునకు రప్పించిన విచారముతో కోపోద్రిక్తుడైన మహాదేవ భూపాలుఁడు బసవన్నను అంత మొందించి వచ్చుటకు కల్యాణమునకు వచ్చి బసవన్నగారిని దిలకించినప్పుడు తనలోని దుష్ట విచారము దొలగిపోయి సద్భావమేర్పడి కల్యాణము నందే శరణ సాంప్రదాయమును అనుసరించి నివసించి యుండెననియు దెలియును.

ఆ సాంప్రదాయాన్ని అనుసరించి నివసించి యుండెననియు, అనేక అఖ్యాన ములు వీరశైవసాహిత్యములో లభ్యమగుచున్నవి. ఈతఁడు వచనకారుడై యుండెను. భారత చరిత్రలో కాశ్మీరము-కర్నాటకమునకు అత్యంత మధుర సంబంధ మునకు స్థానము ప్రత్యేకించబడి యనేక దృక్కోణములలోని రెండు భూభాగములు ఔన్నత్యము యొక్క శిఖరాన్నందుకొని యుండినవి. ఈ రెండు రాష్ట్రములలో బహు ప్రాచీన కాలము నుండియు వాణిజ్యము, తాత్వికము, సాహిత్యము, సాంస్కృతికముల సంబంధముండినట్లగుపడు చున్నది.

బళ్ళగావి, ఐహొళె, పట్టదకల్లు మరియు కళ్యాణపు వీరవణిజులు, కాశ్మీరము, నేపాళము, కురుంబము, కాంభోజము, గొల్లలు, లాకులు, బర్బర, మొదలగు దేశముల స్థల-జల, మార్గములనుండి వ్యాపారమునకు వెళ్ళి వచ్చుచుండిరి. వీరు వీరశైవులే అయి యుండి కట్టుదిట్టమైన అచార పరిపాలనము గావించుచు వ్యవహరించుచుండిరి. మస్తకమునందు శివలింగమును ధరించుచుండిరి. తత్వనిష్ఠులైన ఈ వణిజులు, కాశ్మీర మున కర్నాటక సంస్కృతి మరియు తాత్వికాభిప్రాయముల విషయమై అచటి శైవజనాంగముపై తమ ప్రభావమును విస్తరింపజేయుచుండిరి. కాశ్మీరము యొక్క ప్రత్యభిజ్ఞానము మరియు ఉత్తర భారతములోని కాళాముఖి, లాకుళము, పాశుపతము, మహేశ్వరులే మొదలగు మతములకు కర్నాటక వీరశైవులకు నికట సంబంధమున్నది. పాశుపతము, కాళా ముఖము లకులీశ. మాహేశ్వర పంధములైతె, కొద్దిగ ఇంచుమించుగా ఒకే విధముగా నున్నట్లుగా దోచుచున్నవి. ఈ శైవమార్గములు ఉత్తర భారతములో ఆచరణ యందుండి దక్షిణ భారతము వైపు విశేషముగా కర్నాటకమునకు వచ్చి యచట ఉచ్ఛ్రాయ స్థితిలో నుండి చివరకు వీరశైవము యొక్క పండ్రెండవ శతమానము క్రాంతి (విప్లవము)

సమయము విలీనములైనట్లు విద్వాంసులచేః వ్రాయపడుచున్నారు. కాశ్మీరమున తొమ్మిదవ శతమానమునకంటె పూర్వములోనె శివాద్వైత సిద్ధాంతము ప్రచారమునందుండి పదునాలుగవ శతమానము వరకు ఆ సిద్ధాంతము విషయమై యనేక సంస్కృత గ్రంథములు బుట్టి పెరిగినవి తరువాత పరకీయుల రాజకీయపు ఆందోళన (విప్లవము) పరిణామముగా అవి యన్నియు దక్షిణపు వైపు అనగా కర్నాట కము వైపు ప్రవహించి వచ్చి యున్నట్లు గోచరించుచున్నది. కర్నాటకము వైపే గాకుండ వేరేవైపుగూడ వ్యాపించియుండవచ్చును.

మారయ్య శరణయ్యల వద్దనున్న ఆరువేల జంగమములను బసవన్న దొంగిలించి తెచ్చి యున్నాడనియు చోర బసవ పురాణ ప్రవచన ప్రవాహములో కాశ్మీర భూపాలుఁడు వీరశైవుఁడే అయి యుండెననియు జంగమ పూజా నిరతుఁడనియు దెలియుచున్నది.

సిద్ధ రామునివలె కల్యాణమునకు వచ్చిన పిదప వీరశైవోపదేశమును బడసిన విషయమై యే గ్రంథములందును వివరించలేదు, అంతేగాదు, మిగత సౌరాష్ట్ర మరియు గుజరాతు, బర్బర, దేశముల నుండి వచ్చినట్టి యే శివశరణుల విషయమైనను ఈ ప్రస్తావనకు వీరశైవ సాహిత్య గ్రంథమందు సాక్షాధరములులేవు, అందుచేత వీరు తమ ప్రదేశము లందున్నప్పుడే వీరశైవులై యుండిరని చెప్పుట కవకాశమున్నది.

లింగధారణ తత్త్వమునునది అర్వాచీనమైనదేమి గాదు, అది బహు ప్రాచీన లింగధారణ విచారమును గురించి :— ఈ దిగువ ప్రమాణములు చూవి. "నశ్రోత్రియేన లింగస్థో" (మనుస్మృతి) "బ్రాహ్మణో లింగినంచైవ" (మనుస్మృతి) లింగాకిత భుయోద్విజః" (శంకర విజయము) మాధవాచార్య

కృత (సర్గ-11) "శిరసి లింగంచ ధారిణో జంగమస్తథా" (శంకర విజయ, మా, కృత) లింగాంగి సంగినం (లింగపురాణ) శివలింగ సమాశ్రిత: (విశ్వేశ్వర సంహితె) లింగినో యశ్చవాద్వేష్టి (శివగీత) లింగనేచతరాయచ (మహాభారతము అ. శా. పర్వము)

పై నుదహరించిన గ్రంధములలో శంకర సంహితము నొక దానిని వదలేసి మిగత గ్రంథములన్నియు ప్రాచీనములే అయియుండి లింగధారి జనసమూహము యొక్క అర్థమునే వ్యక్త పరచునట్టి శబ్ద ప్రయోగ మున్నది. ఇదేగాకుండ ఇంకను ననేక గ్రంథములందు లింగధారి జనాంగము విషయమై యనేకా ధారములు లభించుచున్నవి.

"విష్ణు బ్రహ్మాదయోదేవా......విశేషతః ఇట దేవతలందరు తమ సిరస్సులందు లింగమును ధరించి యుండిరని దెలియుచున్నది, అంతేగాదు స్కంద పురాణాము, కాశీ ఖండము నాలుగవ అధ్యాయములో" అర్ధనారీశ్వర శ్చైవ శంకరశ్చంద్ర శేఖరః। గణాధ్యక్ష ః। పశుపతిః తేసర్వే లింగదారకాః। గౌరీనాథ, అంబికా పార్వతీపతిః। గంగాధరో మహాదేవః। సతతం లింగధారకాః। తథాశస్త్రాది దూర్వాసోమున యోనందికేశ్వరః మహాకాలో దధీచిశ్చణాదః పాణినస్తథా। స్కంధో భృంగి రిటివీరభద్రశ్చ ప్రమథాదయః దేవాసుర మనుష్యాశ్చ సర్వేతేలింగ ధారకాః॥

ఇవే మున్నగు వాక్యములు ప్రాచీన జనాంగమునందును లింగధారణ పద్ధతి యుండేదనియు, వారందరు తమ ఉత్తమాంగము (సిరస్సు) నందు లింగధారణ జేయు చుండిరనియు, వ్యక్త మగుచున్నది, ఇప్పటి (నేటికి)కిని యనేక ప్రాచీన శిలా విగ్రహముల మస్తకము యొక్క ముందు భాగము నందు శివ లింగముల చిహ్నముండినవి యగుపడుచున్నది. పండలా

పురము విఠోబ సిరస్సునందును లింగమున్నదని, జ్ఞానేశ్వర-రామ దాసాదులు వర్ణించి యున్నారు. బార్సిలో నున్న భగవంత, అనంతశయనములో నుండిన పద్మనాభుడు, కొల్హాపురము మహాలక్ష్మి, కాశీ విశాలాక్షి, కంచి కామాక్షి, కాశ్మీర శారదాదేవి, తుళజా పురము భవానీ, మొదలగు విగ్రహముల మస్తకము యొక్క ముందు భాగమున లింగము లున్నట్లు తొలచిన దానిని బరిశీలించిన యెడల లింగధారణ తత్త్వ విచారములో ప్రాచీనత ఉట్టిపడుచున్నది. కాని ఉద్దేశ్యము భావనములలో భిన్నత్వ ముండవచ్చును, బసవన్న గారే లింగధారణ తత్త్వమును వెలికి దెచ్చిన వారు గారు, వారు కేవలము లింగధారణ తత్త్వము నందున్నట్టి లక్ష్యము (ఉద్దేశము) యొక్క గొప్ప దనమును గురు తునకు దెచ్చిరి. అనగా లింగ ధారులలో కొందరెల్లప్పుడు జ్యోతిర్లింగాదులకు వెళ్ళి అక్కడి నుండి దెచ్చినట్టి లింగములనే తమ దేహములపై ధరించుచుండిరి. (జ్యోతి ర్లింగాదులకు వెళ్ళి దర్శన పూజాదులను జేయుట సామాన్యమైన దనియు) దెలియుచున్నది.

వీరశైవ లింగధారణ తత్త్వమునందు ఇట్టి విచారమునకు స్థానము లేదు, మస్తకములో నున్న చిత్కళయే లింగ రూపమై గుర్వనుగ్రహము వలన కరస్థలమునకు వచ్చి యున్నది, దీనిని స్థూల-సూక్ష్మ-కారణ దేహములకు అనగా వీరశైవ పరిభాషలో ఇష్ట-ప్రాణ-భావములకు స్పృశింప జేసి దేహము యొక్క ఇష్ట ప్రాణము-భావము, వీటి ఆరిష్ట నివారణము గావించి, వాటి మూల స్వరూపమైన (ప్రాకృత గుణములను) అప్రాకృత మొనర్చుటయే ముఖ్యోద్దేశమై యున్నది. ఈ విచారమునకు స్థావర లింగములను ధరించునట్టి విచారమునకు మహదంతరమున్నది గదా! బసవాది ప్రమథులు లింగధారణాది తత్వములో ప్రాచీనుల ఆశయము మేరకు తత్త్వమును తమ విచార క్రాంతి (విప్లవము)ని ముందాచరించుట

చేత పైనుదహరించిన రీతిలో ఉద్ఘోషించి వారి దివ్యోద్దేశమును సార్వత్రికముగా మార్చిరి.

అ ము గి దే వు డు :

ఇతఁడు సొన్నలా పురం (శోలా పురం)లో నేతకాయకము (వృత్తి)ను జేపట్టి యుండెను, ఒకనాడు సిద్ద రామేశ్వరుఁడు శ్రీ మల్లికార్జున స్వామి యారాధనమునకై అందరికి బంపినట్లుగా వడ్లను దంచుటకు బంపెను. సిద్ధ రాముఁడు భవియగుట వలన నేను దంచను అనియనగా సిద్ధ రాముడు క్రుద్ధుడగుటను జూచి యీ గ్రామమును విడిచి కల్యాణమునకు బోవుదమని ఇంట్లోని సామానులను మూఁడు మూటలుగా జేసి ఆ మూడింటిలో ఒక మూటను తన భార్య నెత్తిన బెట్టి రెండవ దానిని తాను నెత్తిన బెట్టుకొని బయలు దేరెను. అప్పుడు భార్య మూడవ మూటను ఎవరు దెచ్చెదరని అడుగగా దానిని శివుడు దెస్తాడులే, అని చెప్పి తాను బోవుచుండగా కల్యాణ పట్టణము సమీపమున నున్న శివపురములో మూఁట ముందుగానే వచ్చి యుండగా ఇక్కడే ఉండుటకు శివునానతి యైనదని అక్కడే ఉండిపోయెను. మరుదినమున శ్రీ సిద్ధ రామేశ్వరుడు అభ్యంజన స్నానము జేయుచుండగా మల్లికార్జున లింగము నెమ్మదిగా వ్రాయుఁడు శ్రీ అముగి దేవుఁడిమూటను నెత్తిన మోసుకొని రావడము చేత కాస్త నొప్పిగా నున్నది యని చెప్పగా సిద్ధ రాముఁడది విని నివ్వెరపోయి వెంటనే వెదకుతూ బోయి అముగి దేవుడిని దర్శించి తమ నగరమునకు రావల్సినదిగా కోరెను. అందు అముగి దేవుడు "నీవు లింగమును ధరించిననే నేను రాగలను, అని చెప్పగా సొన్నలా పురమునకు వెళ్ళి లింగమును ధరించుకొని వచ్చెను. (అచ్చట సిద్ధ రామేశ్వరునికి లింగమును ధరించిన వారెవరు?) అంతలో అముగి దేవుడు కల్యాణమునకు బోవుటకు సిద్ధముగా నుండెను. కల్యాణయునకు నీవు రా అక్కడే మన మిరువురము గల్సికొందము అని చెప్పి వెళ్ళిపోయెను.

**సిద్ధ రామేశ్వరుడు :**

సిద్ధ రామేశ్వర పురాణములో రాఘవాంక కవి శ్రీశైలము నందు మల్లికార్జునుడే సిద్ధ రామేశ్వరునకు పంచకలశ ప్రతిష్ఠా పూర్వకముగా దీక్షానుగ్రహము నొసఁగినట్లు చెప్పి యున్నాడు. (సత్య దర్శన గ్రంధమునందు) సిద్ధ రామేశ్వరుఁడు సొన్నలా పురము యొక్క బృహన్మఠాధిపులు జగద్గురు శ్రీ రేవణ సిద్దేశ్వరుడే లింగధారణ దీక్షానుగ్రహ మొనర్చినట్లు చెప్పబడినది. ఆముగి దేవుఁడి చరిత్ర యందును సొన్నలా పురమునందే లింగధారణానుగ్రహమైనట్లు చెప్పఁబడినది. చెన్న బసవేశ్వరుని వలన లింగధారణ దీక్షానుగ్రహమైనది. (ఇట్లే ఈతని లింగధారణ విషయమై భిన్నాభిప్రాయములున్నవి) ఈతఁడు మహా మహిమా శాలియై వచన శాస్త్రములో ప్రావీణ్యతను సంపాదించి యున్నాడు, తన ఒక వచనములో అరువదియేనమిది వేల వచనములు ఉనట్లు కూడ చెప్పి యున్నాడు. కాని యవి లభించినట్లు అగుపడుటలేదు, ఏమేమి వివరించి యుండెనో దెలియకున్నది. ఈతని శిష్యుఁడగు హావినహాళ కల్లయ్యకు రేవణ సిద్దేశ్వర స్వాముల వారె దీక్షానుగ్రహ మొనర్చి యున్నారు.

**మడివాళ మాచి దేవుడు :**

ఈతని జన్మస్థళము దేవహిప్పరిగి తండ్రి పర్వతయ్య శ్రీ రేవణ సిద్దేశ్వర రుద్రముని మహా స్వాములవారి చేత దీక్షానుగ్రహమును బొందిన మల్లికార్జున స్వామి ఈతనికి గురువు, ఇతఁడు తన యొక్క గురువు నుండె దీక్షానుగ్రహమును బడసి కల్యాణమునకు వచ్చును.

**అయిదక్కి మారయ్య :**

బసవేశ్వరుఁడు రేవణ సిద్దేశ్వరునితో బాటు (ఒక ప్రకరణములో) ఈతని యింటికి విచ్చేయును.

## ఇంక స్వదేశ-పరదేశములలోని ప్రసిద్ధ పురుషుల అభిప్రాయములు

జే. ఎన్. ఫార్క్యుహార్, ఎం.వి.డి. లిట్ అనువారు వ్రాసిన రిలిజిన్, క్వేస్ట్-ఆఫ్-ఇండియా అను గ్రంథములో 259. వ, పుట నుండి వీరశైవుల చరిత్రను గురించి వివరించి యున్నారు, వారు దానిలో ప్రతి యుగములోను శివుని ముఖముల నుండి యుద్భవించిన ఏకోరామ-పడితారాధ్య-రేవణారాద్య-మరుళారాధ్య మరియు విశ్వారాధ్యులను ఐదు మంది యతీశ్వరుల నుండి యీ ధర్మమునెలకొల్ప బడినదని, వీరు బహుశః ప్రాచీన కాలము వారనియు బసవన్న అనునాతఁడు పండ్రెండవ శత మానములో నీ ధర్మమును (మతమును) ప్రచారము గావించెననియు వ్రాసియున్నాడు, మరియు వీరు ఐదు మఠములను స్థాపించి వాటికి క్రమముగా హిమాలయ పీఠమునకు ఏకోరామారాధ్యులు, శ్రీశైల పీఠము నకు పండితారాధ్యులు, బాళెహళ్ళి పీఠమునకు (మైసూరుకు పశ్చిమ దిశనున్న) రేవణారాధ్యులు, ఉజ్జయిని (బళ్ళారి జిల్లా) మరుళారాధ్యులు, కాశీ (బనారస్) పీఠమునకు విశ్వారాధ్యులు, ప్రథమ పీఠాధ్యక్షులై యుండిరని వ్రాసియున్నారు.

మైసూరు ప్రభుత్వ గెజిట్ 219. వ. పుట నుండి 280. వ. పుట వరకు వీరశైవుల విషయమును గురించి విస్తారముగా వివరింపఁబడి యున్నది. 23. వ. పుటలో ఐదు మూల పీఠముల విషయము నిరూపింపఁబడినది.

మరియు థర్స్టన్ గారు ;

"క్యాస్ట్ అండ్ ట్రైబ్సు అఫ్ సదన్ ఇండియా" అను గ్రంథములో ీరశైవుల ఐదు మఠ సంస్థల స్థాపనను గురించి వివరింపఁబడినది.

ఇట్టి మతములు నేటికిని యున్నవి. అని వారు స్పష్టముగా వ్రాసి యున్నారు, తరువాత వారు ఈ యైదు మతములకు సంబంధించిన స్వాములు వీరశైవుల విషయమై భూగోళము ననుసరించి ఐదు గొప్ప భాగములుగా విభజించి యున్నారనియు, ప్రతి యొక్క పీఠాధికారులు తమ తమ ప్రాంతములందు ఆధిపత్యమును నిర్వహించుచున్నారనియు, కాని యీ యైదు పీఠములవారు సాధారణముగా సమస్త జనానీకముపై యాధిపత్యమును బడసి యున్నారనియు, ప్రతియొక్క మతమునకు ఉప మతములున్న వనియు, ఇట్టి ప్రతియొక్క ఉప మతమునకు గురుస్థల (గురుస్థాన) మతములనియు, వీటికి యనేక శాఖా మతములున్న వనియు వ్రాసి యున్నారు. పర్వ దినములు మున్నగు విశేష దినములలో (పండుగ సందర్భములలో) ప్రముఖ స్థానమును వహించి కానుకలను వసూలు (సంగ్రహించుట) జేయుట, మతమునకు సంబంధించిన విషయములను ఉపదేశించుట మరియు సర్వ సాధారణముగా తమ ధర్మము యొక్క అభివృద్ధికి సంబంధించినట్టి సమస్త విషయములపై యధికారమును వహించుట మున్నగునవి ఈ మతాధిపతుల కర్తవ్యమై యున్నది.

క్రీ. శ. 640 అన్నాం (చంపా) దేశము యొక్క ఫో నగరమునకు ప్రభువైన ఇంద్రవర్మ వీరశైవుఁడు. అతని కాలములో శివభక్తి యందత్యంత విశ్వాసముండెడిదని చరిత్ర పరిశోధకులు వ్రాసియున్నారు.

1. గౌరవ ఓరియెంటల్ సీరీస్ క్లాస్ బి నం. 4 భాండార్‌కర్ గారు "వైష్ణవిజం అండ్ శైవిజం" పుట 187 నుండి 190 వరకు వివరణ గలదు.

2. పండిత కాశినాథ శాస్త్రి గారి యుపన్యాసము (ఇంగ్లీషు) గ్రంధము పుట 2, 8 మరియు 10 చూడుము.

3. శృంగేరి మఠము గురువంశ కావ్యము యొక్క పుటలు 109-110.

4. శివతత్త్వ రత్నాకరము పుట 123.

5. బనారస్ గెజిటియర్ పుట 125.

ఈ గ్రంథ కర్తలు తమ అభిప్రాయములను నిష్పక్ష పాతముగా వ్రాసి యున్నారనుటలో నెట్టి సందేహములేదు, ఈ గ్రంథముల పరిశీలనము చేత వీరశైవము హిందూ దేశములోని మతము లన్నింటిలో శ్రేష్ఠత్వమును బొంది యున్నదనియు నాకు చాలా మంచిగా నున్నదని నాకు నిండుగా విశ్వాసమున్నది.

## ఆగమముల కాల నిర్ణయము

భారత దేశపు సంస్కృతి "దశన" అను గ్రంథము యొక్క చివరి పుటల్లో ఆర్-సిన్. కృష్ణ దీక్షితులను వారు వేదాగమముల కాలమును ఏ పండితుని చేతను ఇంత వరకు సప్రమాణముగా బరిశీలించి చూచుటకు సాధ్యపడలేదు, భారత సంస్కృతికి వేదాగమములే మూలాధారములై యున్నవి.

శ్రీయుత వీరప్ప బసప్ప బిళె అంగడి, బి.ఎ.ఎల్.ఎల్.బి., హైకోర్టు వకీలు హుబ్బళ్ళి గారు తమ "వీరశైవ మత ప్రాచీనత్వ" అను గ్రంథము ప్రస్తావన చివరి పుటలో వీరశైవ మతమునకు, వేదములు, ఉపనిషత్తులు, 28 శివాగమములు, వ్యాసోక్త అష్టాదశ పురాణములు శాస్త్రములు, ప్రమాణ గ్రంథములుగా నున్నవి. వేదోపనిషత్తులలో ఈ మతమును గురించి సంక్షిప్తముగా వివరింపబడి 28 శివాగమములలో మాత్రము బహు విస్తారముగా వివరించబడినది. నిగ మాగమముల

కర్త యగుననాది పర శివుఁడే అయి యున్నాడు. వేదాలు బహుళార్థమును ప్రతిపాదించునవి, శివాగమములు, ఏకార్థమును ప్రతిపాదించుట వలన వీటిలో పరస్పర విరోధముండదు. ఇట్టి శివాగమములు **అత్యంత** ప్రాచీన గ్రంథములని చెప్పఁబడుచున్నవి.

**28** శివాగమములు శివుని ముఖము నుండే బుట్టినవి, ఈ విషయమును మృగేంద్రాగమాల్లో ప్రతిపాదితమై యున్నది.

"శివాగమాశ్చ వేదాశ్చ-నిత్యయేన ప్రమాణతః" అనగా శివాగమములు, వేదములు ఎల్లప్పుడు సమానమగు ప్రమాణ గ్రంథములై యొప్పుచున్నవని నుడువుచున్నారు, మరియు స్కాంద మహాపురాణము. సూతసంహిత ప్రథమాధ్యాయములో

"అష్టాదశ పురాణానాం-కర్తా సత్యవతీసుతః ।
కామికాది ప్రభేదానాం-యథాదేవో మహేశ్వరః ॥ అని నుడివి యున్నాడు. పురాణ కాలము కంటెను, భారతము కాలము కంటెను, స్మృతి కాలము కంటెను, ఉపనిషత్కాలము కంటెను, మొట్ట మొదట వేదకాలమేదని చెప్పబడుచున్నదో అదే శివాగమముల కాలమై యున్నది.

వీరశైవ ధర్మము ఒక కాలములో నాసేతు హిమాచలము పర్యంతము వ్యాపించి యుండేదనియు ఆ కాలమున మూడు కోట్ల వీరశైవులుండిరనియు "నిర్మాల్య రత్నాకరము" అను గ్రంథమునందు కాశీ (వారాణసి) బాబుశ్రీ చించు సింహుఁడను ఇతిహాస కారుడు వ్రాసియున్నాడు.

దీని వలన వీరశైవ ధర్మము అనాదియై యుండి దాని నిలవు దొరకుటే కడు దుర్లభముగానున్నది. పరిశోధించినప్పుడల్లా పునః

పురాతనమైనదిగానే దోచుచున్నది. మొత్తము మీద ఈ ప్రపంచమునన్న సమస్త మతములందును అత్యంత ప్రాచీనమైనది వీరశైవమే యని సిద్ధమగుచున్నది.

కలియుగములో శ్రీ రంభాపురీవీరసింహాసనాధీశ్వరులైన శ్రీ జగద్గురు రేవణ సిద్ధ శివాచార్యులు 1400, సం॥ములు భూలోకములో నుండి సంస్కృత భాషలో పదికోట్ల శ్లోకములున్న "పరమరహస్య" అనునత్యద్భుతమైన గ్రంథమును వ్రాసియున్నారు. దానిలో సద్యః మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో ఇరువదియారు వేల శ్లోకములు మాత్రమే లభ్యములగుచున్నవి. వీరుభూలోకములో గోచరించుచు 700. సం॥ములు. ఎవరికిని దెలియకుండ 700. సం॥ములుండిరని ప్రసిద్ధియున్నది.

వీరశైవ సాహిత్య సంశోధకులైన స్టీలుసాహెబుగారు, అష్టభాషాకవీశ్వరులైన శ్రీ పాల్కురికి సోమనారాధ్యులవారు "జ్యోతిర్మయిశాంభవీదీక్ష" యను గ్రంథములోను సోసిలె రేవణారాధ్యులవారు " శివతత్త్వప్రకాశ " మను గ్రంథమునందును "పరమరహస్యం" లో పదికోట్ల శ్లోకములతో గూడిన మహాగ్రంథమనియు చెప్పుచున్నారు

మరియు రేణుకాచార్యుల వారు అత్యంత ముఖ్యమైనదొక జ్యోతిష గ్రంథమును వ్రాసియున్నారు, అది కాశీపీఠముయొక్క గ్రంథ భండారములోనున్నది. మరియు జ్యోతిష్యాచార్యులలో వీరిపేరు "బృహద్దైవజ్ఞరంజనీ" గ్రంథములోను "జాతక మహోదధి" యందును. వశిష్ఠ, మను-పౌలస్త్య-రోమశాదులతో బాటె వచ్చియున్నది.

శ్రీమాన్. జి. ఆర్. జోయిసర్ ఎం. ఎ. ఆనర్సు, ఆఫ్, ఆర్, ఇంటన్. అనువారు "పాలిటెక్స్ ఫిలాసఫి ఫాంటన్స్" అను గ్రంథ

ములో 160. వ పుట సం, పురాతన కాలము నందు వీరశైవ
మతము సర్వత్ర వ్యాపించియుండెడిదనియు, ఈ మతముయొక్క
ప్రధాన ప్రచారకులు పంచాచార్యులనియు, వీరు ఏ కాలములోనుండిరో
తెలియదనియు, కాని బహు ప్రాచీనకాలమునందుండిరనియు నిస్సం
దేహముగా చెప్పవచ్చును. వీరు యోని సంభూతులైన వారుగారు.
అయోనిజులు, పవిత్రములైన శివలింగముల నుండి యవతరించి
యున్నారు. వీరు సర్వత్ర వీరశైవ సిద్ధాంతమును ప్రచారము
జేయుటేగాకుండ అయిదు ముఖ్యమఠములను స్థాపించియున్నారని
వ్రాసియున్నారు.

2. మహేశ్ చంద్రగురు, సుప్రీంకోర్టు సీనియర్ అడ్వకేటు ప్రకాశక సంస్థయొక్క ట్రస్టీగారు శ్రీ మత్పంచాచార్యులు ప్రపంచమునకు మొదట పరమ శివుని పంచముఖములనుండి యుద్భవించి నాలుగు యుగములందును పంచ లింగోద్భవులై (పంచ లింగముల నుండి యుద్భవించి) భూలోకములో నవతరించిన విషయమును విశదపరచి యున్నారు.

3. కళాప్రపూర్ణ శ్రీ చిలుకూరి నారాయణరావు. ఎం. ఏ. పి. హెచ్‌డి గారు "శాస్త్రధర్మ సంగ్రహము" అను తెలుగు గ్రంధమునందు వీరశైవులలో ప్రాచీనకాలమునుండి నేటివరకు ఐదు గోత్రములు వ్యవహారములో నున్నవనియు, శివాగమ శిలాశాసనముల ఆధారముల నుండి సిద్ధాంతపరచియున్నారు.

4. శ్రీ శంబాజోషిగారు వీరశైవులు ఈ సృష్టికి మూల పురుషులు అని తమ "శివరహస్య గ్రంధములో" సిద్ధాంతీకరించియున్నారు.

5. అద్వితీయ పండితులు విరక్తశిఖామణులు అయిన శ్రీ. మ. ని. ప్ర. మరితోంటదాచార్యులు తమ "వీరశైవానందచంద్రిక" అను గ్రంథములో వీరశైవప్రవర్తకానాం- రేణుకాదీనాం తథాచ గోత్ర ప్రవర్తకానాం రేణుకాద్యాచార్యాణాం" అని నుడివి యున్నారు.

6. అప్పనార్యుడను తెను (ఉ) గు, గొప్ప విద్వాంసుఁడు తన "శైవాగమ శిఖామణి" అను గ్రంథమునందు వీరశైవ మతము అనాదికాలము నుండియు వచ్చియున్నదని శ్రీ రేణుకాద్యాచార్యులవారి విషయమును విస్తరించియున్నారు. మరియు ఒకానొక కాలము నందు ఇహ-పర-లోకములందును (రెండింటిలో) ఉండెనని సమర్థించియున్నారు

7. వ్యాకరణ తీర్థ శ్రీ వే॥ పం॥ చంద్రశేఖరశాస్త్రి గారు బృహన్మఠ హొళలుగారు తమ "బసవతత్త్వ రత్నాకరము" అను గ్రంథములో శ్రీ బసవేశ్వరులవారు అత్యద్భుతములైన అనంత కృతులను రచించుటవలన అనేక మంది పండితులు, కవులు, వీరికి మత స్థాపకులని వ్రాసియున్నారు. కాని ఆద్యంతములను బరిశీలించినయెడల బసవేశ్వరుల వారు వీరశైవమతోద్ధారకులైయున్నారు, వీరు మతోద్ధారకులే యనుటకు చాలినన్ని ప్రమాణములున్నవి. వీరశైవ మతము బసవన్నగారి కంటెను పూర్వ కాలమున ననేక జన ఆచార్యుల వలన కాల కాలమునకు (ప్రతి కాలమునకు) దగినంతటియభివృద్ధి దశ లోనుండినది. ఇష్టలింగార్చన చాల కాలమునుండే ప్రచలితమై యున్నది. అనేక మంది యాచార్యులు ఈ మత ప్రవర్తకులై యున్నారు. ఆ కాలమునకు సంబంధించిన సుస్పష్టమైన ఇతిహాసమును గమనించవల్సియున్నది.

ముఖ్యముగ జగద్గురు పంచాచార్యులే ఈ మతము యొక్క సంస్థాపకులని ఆగమములు మున్నగు వాటిలో ప్రమాణములు లభ్యములగుచున్నవి. సమాజములో లింగధారణ, శివదీక్షా, వివాహవిధి మొదలైన ధార్మిక కార్యక్రమములన్నియు నీయైదు మంది ఆచార్యులు ఏక కాలములో భూలోకమున అవతరించిరో లేదా వేర్వేరు కాలములందుండిరో అను విషయమై నిశ్చితమైన ఇతిహాసమును పరిశోధించ వలసి యున్నది.

8. శ్రీ వే॥ పం॥ కలిగణనాథశాస్త్రిగారు, పంచాక్షరశాస్త్రిగారు, తర్కతీర్థ బృహన్మఠ పగడిదిన్ని, బాగలకోటి శ్రీ బసవేశ్వర విద్యావర్ధక సంఘము యొక్క సంస్కృత పాఠశాల ప్రధానాధ్యాపకులు శ్రీ బసవేశ్వరుడు తన కాలమునందు కేవలము శివాగమోక్తమునలైన వీరశైవతత్త్వములనే సమాజములో ప్రచారముగావించియున్నాడు. కాని స్వతంత్రముగా యేతత్త్వములను ప్రచారము చేయలేదు.

9. వీరశైవ మతము కలచూరి వంశమునకు జెందిన బిజ్జళరాజు కాలమున అతనికి ప్రధానామాత్యులైన శ్రీ బసవేశ్వరుని నుండే స్థాపింపబడినదని సాధారణముగా మన మతములోని కొందరు పర మతస్థులు గూడ దెలిసికొనియున్నారు, కాని వాస్తవస్థితి యట్లుగాదు. శ్రీ బసవేశ్వరుని కంటే పూర్వమున కొన్నివేల సంవత్సరముల కంటెను పూర్వమునందే భరత ఖండము నందు మన ఈ వీరశైవ మతము అత్యంత ఉచ్ఛ్రాయదశ యందుండేదనియు ఈ మతము యొక్క అనేక ప్రాచీన గ్రంథములనుండియు అన్యగ్రంథములనుండియు దెలియుచున్నది. బసవేశ్వరుడు ఈ మతము యొక్క స్థాపకులుగాక అతనికంటే వేల సం॥ములకు బూర్వమే శ్రీ రేణుక-

దారుక-గజకర్ణ-ఘంటాకర్ణ విశ్వకర్ణ-మొదలగువారు ఆచార్యులు మత స్థాపకులైయున్నారు. (5. వ. శ్రీ మద్వీరశైవ మహాసభ బళ్ళారి. అధ్యక్షులు)

తేది 27-12-1909. సోలాపురము వారద మల్లప్ప బసప్పగారు

10. 21-2-1960. వ, సం॥ములో శివయోగమందిరమునందు సమావేశమైన అఖిలభారత వీరశైవ మహాసభ 17వ అధివేశనములో మహా సభాధ్యక్ష పీఠము నుండి ర్యాంగల్ శ్రీ డా॥ చి॥ పావటె, ఎం.ఏ. (క్యాంటోబిట్) ఉపకులపతి (వైస్‌ఛాన్సిలర్) గారు కర్నాటక విశ్వవిద్యాలయము ధారవాడగారు సెలవిచ్చిన యుపన్యాసము, మన వీరశైవధర్మము అతి ప్రాచీనమైనది. ఇది సర్వాంగ సౌందర్యముతో విరాజిల్లుచు ఉదాత్తమైన తత్వ్వములతో నలంకృతమైయున్నది. ఇట్లు ప్రవచించుటలోనేమాత్రము సంశయములేదు.

బసవన్నగారు భరతఖండములో సుప్రసిద్ధులైన మహాత్ములలో వీరుగూడ ఒకరు, వారొనర్చిన గొప్పకార్యములను బరిశీలించిన యెడల వారి సంఘ సంస్కారము పరిగణకు దీసకొన్నచో బసవన్న గారికి, బుద్ధుడు, మహావీరుడు, గాంధిగార్లతో బాటు నిస్సందేహంగా ఉన్నత స్థానమలంకరించినవారే.

11. శ్రీ బసవేశ్వరులవారి అష్టశతమానోత్సవమును బసవకల్యాణమునందు ఆచరించినప్పుడు శ్రీ మన్మహారాజనిరంజన జగద్గురు శ్రీ గంగాధర రాజయోగీంద్ర మహాస్వాములవారు మూరుసావిర (మూడువేల)మఠాధీశులు హుబళ్ళి గారు నిరూపించి (ఆనతిచ్చిన) అధ్యక్షోపన్యాసము సంక్షిప్త సారాంశముమ తేది 27-12-1967లో ప్రకటించిరి.

యుగప్రవర్తకుడగు మహాత్మ శ్రీ బసవేశ్వరుని అష్టశత మానోత్సవ సమారంభమును భారతదేశములోని యెనిమిది స్థానములలో మైసూరు రాజ్యప్రదేశ ప్రభుత్వమువారు మరియు బసవసమితి వారు కలిసి అత్యంతవైభవముతో ఆచరించుట సన్నిధికి (మాకు) మహానందమును గూర్చినది.

వీరశైవమతోద్ధారకులైన మహాత్మ శ్రీ బసవేశ్వరుఁడు వీరశైవ సిద్ధాంతములో నిమిడియున్న భక్తి-జ్ఞాన-వైరాగ్యముల త్రివేణి సంగమమునకు ఒక శాశ్వతమైన రూపురేఖలను దీర్చిదిద్దుటకై కల్యాణపట్టణమున శివానుభవమంటపమును నెలకొలిపి యున్నాఁడు.

అట్టి శివానుభవమంటపముకే జన్మమున భక్తులకు ముక్తి నొసఁగుటయందు సమర్థవంతముగానుండినదని నిరూపించినది... ఇట్లు 800, సం॥ములకు పూర్వమే మహాత్మ శ్రీ బసవన్నగారు అసాధారణమైన దానిని సాధించి అనుభవమంటపము ద్వారా గొప్ప విప్లవమును (క్రాంతిని) కొద్ది సమయములోనే కృషిసల్పిన దానిని గమనించినచో ఆశ్చర్యముగాకమానదు. "అమరవాణి ఉజ్జ్వలమాన పత్రిక" సంపాదకుడు, **బి.ఎం.** వీరేశ్వరశాస్త్రి విద్వాన్. ఉపసంపాదకులు డా॥ ఎస్.ఎం. హుణిశ్యాళ. ఎం.ఎ.పి.హెచ్.డి. రాయచూరు గారు. సహసంపాదకులు. ఎ. శివానంద ఎం.ఎ గారు ప్రకటించిరి.

## వచన శాస్త్ర సారభాగము 2.

### వీరశైవ సిద్ధాంత ప్రస్తావనలో :-

12. వీరశైవ ధర్మము యొక్క సారమును దాని సమస్త భాగము ఉపభాగములతోసహ సమగ్రముగాను మరియు తాత్వికపద్ధతిగా నిరూపించు

టకు ఏ గ్రంథము మాకు ఇంతవరకు ఉపలబ్ధముగాలేదు. అందు వలన మా యీ ప్రయత్నము బహు జటిలముగా మారినది. ఇటు వంటి గ్రంథమేదైన లభ్యమగునేమోయను పేరాశకులోనై మేమీ రెండవభాగమును ప్రకటించు సాహసమునకు బూనుకునలేదు. కాని దీనివలన కాలవిలంబనమగునేమోయనిదలంచి మా మిత్రులు మాకు సూచనలు (సలహాలను) ఒసంగుటవలన మాపై మోపిన (ఉంచిన) సిద్ధాంత విషయములను సంగ్రహించి వాటిని సాధ్యమైనంతమట్టు కు వ్యవస్థీకరించి యీ గ్రంథమును మేము ప్రకటించియున్నాము. పుట 604, లో చివరి రెండు పుటలనుండి......వీరశైవ ధర్మ ప్రచార కార్యములు 11 వ, శతమానమునుండి 13.వ, శతమానము వరకు దక్షిణ హిందూస్థానములో బహు ఆర్భటము (ప్రబలము) గా సాగినది. అపుడు శివశరణుల సంఖ్య కర్నాటకాంధ్ర మహారాష్ట్ర తమిళ దేశములందు సంభవించియున్నారు. వీరివలననే వీరశైవ ధర్మతత్త్వములు ఇక్కడ ప్రసిద్ధములైనవి. వీరిలో కొందరు వీరశైవ షట్స్థల స్థాపనాచార్యులని వ్యవహారములోనున్నప్పటికిని, వారందరు ధర్మప్రవర్తకులేగాని ధర్మసంస్థాపకులని జెప్పుటకు వీలులేదు. ఇట్లే ఈ సమయములో వీరశైవధర్మము ప్రబలముగా ప్రవర్ధమానమైనను దానికంటెను ఇంక పూర్వమే దాని పుట్టుక యుండినది. అప్పుడు దాని స్వరూపము ఎట్లుండినదని చెప్పుటకు ఇంకను పరిశోధించవల్సిన విషయమైయున్నది. (తేది 15-1-1938,ఫ,గు, హాళకట్టి)

3. ప్రకాండపండితులు, కర్నాటక కవిసార్వభౌమాది యనేక బిరుదాంచితులు లయిన షః బః చంద్రశేఖరశాస్త్రిగారు మంగాపురము మఠమువారు.

(1) శ్రీ జగద్గురు పంచాచార్యులే వీరశైవ మతస్థాపకులు మరియు

(2) బసవన్నగారు మతస్థాపకులా ? మతోద్ధారకులా ? అను రెండు గ్రంథములను వ్రాసి యనేక ఆధారములతో బసవన్న మతస్థాపకులుగారనియు సిద్ధాంతీకరించియున్నారు. మరియు ఎవరైన మతస్థాపకుడని ఆధార యుక్తముగా ప్రబల ప్రమాణములతో సిద్ధాంతమొనర్చినట్లైతే వారికి రూ|| 3000/- (మూడువేల రూ||లు) పారితోషకమొసంగెద ననియు ప్రకటించియున్నారు. (1971. సం||లో) నేటికిని యెవరును సాహసించి ఆ పారితోషకమును బడయలేదు.

14. చిక్కమణ్ణూరు బృహన్మఠాధ్యక్షులు పం|| శ్రీ గురుదేవ శివాచార్య మహాస్వాములవారు ఆయుర్వేద ఆచార్య నవలుగుందగారు తాము వ్రాసిన వీరశైవ పంచాచార్యుల చరిత్ర విమర్శ అను గ్రంథములో శ్రీ మల్లికార్జునఅనువారు సంచాచార్యుల వారినైజతత్త్వమునకు భంగము వాట్టిల్లజేయు పిచ్చితనమును (ఉన్మాదమును) సంపూర్ణ ముగా విడిపించి, జంగమ శబ్దము యొక్క ప్రాచీనతను జగద్గురు పంచాచార్యుల లింగోద్భవ విచారమును, పంచాచార్యుల ప్రాచీనతను శృంగేరి ఆదిశంకరాచార్యులకు జగద్గురు శ్రీ రేవణ సిద్ధేశ్వరుల వారు శ్రీ చంద్రమౌళీశ్వర లింగమును అనుగ్రహించిన విషయమును సుస్పష్టము జేసియున్నారు. అట్టి గ్రంథమును వీరశైవులందరు సమగ్రముగా శ్రద్ధతో జదివి వాస్తవ విషయమును గ్రహించవలెను.

15. వీరశైవ ధర్మముయొక్క పుట్టుక అథవా వీరశైవ ధర్మప్రాచీనత అను గ్రంథమును శ్రీమాన్ టి.ఎన్. మల్లప్పగారు, బి.ఎ.ఎలెఎల్.బి.

నివృత్త (రిటైర్డు) మైసూరు హైకోర్టు న్యాయాధీశులు, బెంగూళూరు గారు అనేకాధారములతో (ప్రమాణములతో) ఆ గ్రంథములో వీరశైవ ప్రాచీనతను సిద్ధాంతపరచియున్నారు, ఆ గ్రంథమును బఠించవలెను.

## వీరశైవ ధర్మము విషయమై మహత్వపూర్ణమైన నిర్ణయము

తేది 23-10-1971. సంయుక్త కర్నాటక దిన పత్రిక పుట. 7.

నవలగుంద 22, వీరశైవధర్మము విషయమైయిచటి నవలగుంద గవిమఠములో మహత్వపూర్ణమైన చర్చజరిగి "ఈ సభలో శ్రీ జగద్గురు రేణుకాది పంచాచార్యులు వీరశైవ మత స్థాపనాచార్యులు మరియు భక్తి భాండారి బసవాదిప్రమథులు వీరశైవ మతోద్ధారకులు" అనుతీర్మానము నంగీకరించడమైనది.

కైలాస పతియగు శంకరుడు వీరశైవమతోత్పత్తికై యీ పంచాచార్యులనే బంపియున్నారనుటకు శివాగమములయొక్క ప్రమాణ మున్నది.

శ్లో॥ రేవణోమరులశ్చైవ ఏకోరామః పండిత ఏవచ ।
విశ్వారాధ్య ఇతిప్రోక్తాః కలావపిమమప్రియే ॥ (74) ॥
"వీరశైవమతోత్పత్తి" హేతావైతాంశ్చపంచకాన్ ।
మన్ముఖేభ్యః సముత్పాద్య తైరేవాకర్ణమంజసా ॥ (55) ॥
(వీరశైవ సదాచార సంగ్రహము, ప్ర. 1)

ఇట్లే ఇంకను వేదాగమోపనిషత్తుల ప్రమాణములు. అనేక ఐతిహాసిక గ్రంథాధారములు విపులముగానున్నవి, కాని దృష్టాంతమునకై కొన్ని గ్రంథములను మాత్రమే ఉదహరించడమైనది.

ఇంక శిలా శాసనములు :-

క్రీ.శ.3. శతమానములోని పాండ్యరాజు ఉజ్జయినీ సద్ధర్మసింహాసనముయొక్క మఠమును జీర్ణోద్ధారము గావించి యున్నాడు. ఈ విషయమై ఒక శిలా శాసనమును ఆమఠమున స్థాపించి యున్నాడు.

క్రీ.శ. 5; వ. శతమానములో కంచి పట్టణము యొక్క కైలాస్ నాథుని మందిరమున 28. శివాగమముల పేర్లుగల శిలాశాసనమున్నది. ఇట్టి శివాగమములే వీరశైవధర్మమునకు ఆధార గ్రంథములు

క్రీ.శ. 428 లో చంపాదేశముయొక్క వాటిక ప్రభువు 2.వ. ప్రవరసేనుడు వీరశైవుడై యున్నట్లు శిలాశాసనము దొరికినది.

క్రీ.శ,6. వ. శతమానము మావల్లాపురము యొక్క (మద్రాసునకు 22 మైళ్ళ దూరమునందున్న) ప్రభువైన అత్యంతకాముడను మహారాజు తన మస్తకముపై లింగమును ధరించుచుండెను, ఈవిషయమై శ్లోకము లున్న శిలాశాసనము గణేశ దేవస్థానమునందుకలదు.

క్రీ.శ. 6. వ, శతమానములో మద్రాసు స్టేటులో తిరుచినాపల్లి సమీపములో గుట్టగుహలోనున్న రెండు స్తంభములపై సుగుణభర మహారాజుయొక్క శిలాశాసనములున్నవి. ఈ రాజు దన యెదపై లింగమును ధరించుచుండెడివాడనియు (వీరశైవుడని) వ్రాయబడినది.

క్రీ.శ. 6. వ. శతమానమున కంచి పట్టణముయొక్క రాజసింహేశ్వరదేవస్థానము ప్రాకారముపై తొలచబడిన పల్లవరాజసింహుడను మహారాజు శిలాశాసనములో రాజసింహుడు లింగమును దనభుజమునకు ధరించు చుండెనని (వీరశైవుడని) నిరూపించనైనది.

క్రీ.శ. 6. వ శతమానము మద్రాసునకు 48 మైళ్ళ దూరము నందున్న చంగలపేట జిల్లా వాయలూరు గ్రామములో రాజసింహుడను మహారాజు లంగిన్ "శివ చూడామణి, శ్రీ వృషభలాంఛనే, శ్రీ ఆగమ ప్రవీణ" ఆగమానుసారి" మొదలగు విశేషణములతో తొలచబడిన శిలా శాసనము వ్యాఘ్రపురీశ్వరదేవస్థానమునందు రెండు స్తంభములపై తొలచబడినది.

క్రీ.శ. 6. వ శతమానములో కాంచిరాజ్యమును బరిపాలించిన అత్యంత కామరాజసింహుడు, గుణభర అను పల్లవ వంశపురాజు, లింగధారులై యుండిరనియు, శాసనము సంఖ్య 18 శ్లోకములు 3-9-11, లలో సం. 21 లోను మరియు అదే గ్రంథము నం, 33-34. లలోను "శిరసి శంకరం లింగేన లింగివి జ్ఞానం శివ శిరసిధారయతా శివచూడామణి ఆగమ ప్రవీణ వృషభలాంఛన ఆగమానుసారి అను విశేషణములతో దెలియుచున్నది.

క్రీ.శ. 958. లో ఈ శానశివగురువులవారు సంస్కృతమున రేవణ సిద్ధుని చరిత్రమును వ్రాసియున్నారు. అను విషయము కడపజిల్లా సిద్ధవటము తాలుక దొంగలసాని గ్రామము యొక్క శివాలయమునందలి శిలాశాసనమునుండి దెలియుచున్నది.

## ఇంక ప్రాచీన వస్తువుల విచారము :-

కొల్హాపురము మహాలక్ష్మి మస్తకమునందు లింగమున్నట్లు అదే మందిరములోనున్న ఒక శిలాశాసనముపై నున్నది. అదేమేరకు

పండరిపురము పాండురంగవిఠలుడు లింగాధారియై యున్నట్లు ప్రతీతి గలదు. హావేరి సిద్ధేశ్వరుని గుడిలోనున్న సూర్యమూర్తి మస్తకమున లింగమున్నది. హైదరాబాదుకు సమీపములో నల్లగొండ జిల్లా. భువనగిరి తాలూకాయందున్న జగద్గురు శ్రీ రేణుకాచార్యులు శ్రీ సోమేశ్వర

లింగమునుండి యుద్భవించిన కొలనుపాక పుణ్యక్షేత్ర మందిరములో పురాతత్వ శాఖవారు సంగ్రహించియున్న శిలావిగ్రహము నిల్చొనియున్న హనుమంతుని వామహస్తములో లింగము నేటికిని ప్రత్యక్షముగా నున్నది. ఈ విగ్రహమును దిలకించినచో పూర్వకాలమున వీరభద్రునిచే లింగదీక్షను హనుమంతుడు బడసిన ఉదంతాన్నిచాటుచున్నది.



మద్రాసులో తిరువళ్ళూరు వారి మందిరమునకు జేరువలో వారి ధర్మ పత్ని మందిరముగూడ యున్నది, ఆ మందిరములోనున్న స్త్రీ విగ్రహము తిరువళ్ళూరు గారి ధర్మపత్ని వాసవీదేవిదని చెప్పుతు ఉంటారు. ఆ మూర్తి మస్తకమునందును లింగమున్నది. ఆ కారణముచేతనది శివలింగధారిమూర్తి, తిరువళ్ళూరు వారి మందిరములోని అర్చకులు లింగధారులైయున్నారు. తిరువళ్ళూరు వారి స్థానము తమిళ సాహిత్యములో అత్యంత ప్రాచీనతమమైనది. అత్యంత మహత్వపూర్ణమైనదనియు, తమిళ సాహితీవేత్తలు ప్రాంజల మనస్సుతోనంగీకరించి యున్నారు. కన్నడమున సర్వజ్ఞవచనములున్నట్లు తమిళములో తిరుక్కురుళ్ళున్నవి, వీనిని భాషా మరియు ఇతిహాసము దృష్టిచేత విమర్శించిన తమిళ పండితుడు. అతడు మొట్టమొదటి యత్యంత ఉత్తమ ప్రాచీన కవియని నిశ్చయించి (నిర్ణయించి) యున్నారు. అతని కాలము క్రీ.శ, ప్రారంభములో అథవా ఒండు రెండు శతమానములకు వెనుకముందుండవచ్చును.



అట్లే ఆంధ్రప్రదేశమున కర్నూలు జిల్లాలోని శ్రీశైల పుణ్యక్షేత్రమున శ్రీమల్లికార్జునస్వామి వారి అర్చకులు గూడ అత్యంత ప్రాచీనకాలము నుండి వంశపరంపరంగా వచ్చియుండిన వీరమాహేశ్వరులు నేటికిని లింగ ధారులే, అంతేగాకుండ భారతదేశములోని మరికొన్ని దేవాలయపూజారులు లింగవంతులైయున్నారు.

అనంతశయన అనంత పద్మనాభుడు తనహస్తతలములోను లింగమున ధరించియున్నాడు. తిరుపతిలో వెలసిన వేంకటేశ్వరుని దక్షిణ హస్తము నుండి లింగముపై యభిషేకపునీరు బడుచున్నదనియు, అంతేగాకుండ తిరుపతిలో వేంకటేశ్వరమూర్తి సాక్షాత్తుగా (ప్రత్యక్షముగా) వీరభద్రుని మూర్తియనియు, వ్యవహారము గలదు.

రాష్ట్రకూట మహారాజు క్రీ.శ. 756 నుండి 774 వరకు కట్టించిన కృష్ణ దేవాలయములో మూఁడు శివలింగధారులైన విగ్రహములున్నవి.

పట్టదకల్లు విరూపాక్షదేవుని మందిరములో లింగములను ధరించిన ఆరు శివుని విగ్రహములున్నవి, ఇవి 2-3, వ శతమానములోనివని చెప్పుతుంటారు.

అదే విధముగా మల్లికార్జుని గుడిలో రెండు, సంగమేశ్వరుని గుడిలో ఒకటి, ఇట్లు తొమ్మిది విగ్రహములున్నవి, ఇవిగూడ 2-3, వ శతమానమునకు జెందినవని చెప్పుచున్నారు.

సంగమేశ్వరుని గుడిలో వీణను ధరించిన మూర్తి యొకటియున్నది, అదే మందిరములో మరొకటి ఉమాసహిత అక్షక్రీడా శివలింగము అతని భుజపైయున్నది. దానిని వెనుకటివామ (ఎడమ) హస్తముతో బట్టుకొని యున్నాడు. ఇట్టి శిలామూర్తులు గల చిత్రఫలకలు ఐహోళే, ఎలిఫెంటా జోగీశ్వరీ, మరియు వేరే గ్రామ-నగరములందున్నవి, పట్టదకల్లు-బాదామి.

రాయచూరునకు పూర్వదిశలో 3 మైళ్ళ దూరములో ప్రాచీనమైన దొక దేవాలయమున్నది. అట్టి దేవాలయమున లింగధారియగు విష్ణుమూర్తి విగ్రహము గలదు. (బోళందొడ్డి తిమ్మప్ప గుడివద్ద) ఇంకను ననేక విగ్రహములున్నవి.

## -: ఉప సంహారము :-

వీరశైవ ధర్మయొక్క పుట్టుకను గురించి భిన్నాభిః ప్రాయము లనేకమున్నట్లు దోచుచున్నది, కాని పరిశీలనా దృష్టితో జూచిన యెడల అవన్నియు ద్వేషాసూయలతో గూడిన వ్రాత (రచన) లని దోచుచున్నవి. ఏలన కొందరు శైవమే అభివృద్ధిగాంచి వీరశైవధర్మముగా మారినదనియు, కొందరు పరమశివునిమండే సృష్టించబడినదనియు, మరికొందరు శ్రీ మహాత్మాబసవేశ్వరునినుండే స్థాపించబడినదనియు చెప్పుచున్నారు.

ఇవన్నియు నిరాధారములైన ప్రయోగములు, అంతగా ఉపయుక్తము లైనవి గావు. పరమ శివుని ముఖము నుండి బహిర్గతమైన 28. ఆగ మంబులే వీరశైవ ధర్మమునకు మూలాధారములైన గ్రంథరాజములు. ఆ ఆగమములద్వారానే శివుడు జగన్మాతయైన పార్వతికి జగద్గురు శ్రీ పంచా చార్యులనుండే వీరశైవ ధర్మసంస్థాపన జరిగి యున్నదని నిరూపించి యున్నాడు. దానినే సమస్త జనులు జదివి వాస్తవిక విషయములను దెలిసికొని కృతకృత్యులుగాగలరు.

ఇట్లు
గ్రంథకర్త.

"ఇతి శివంభూయాత్"





# గ్రంథకర్త పరిచయము

తెలంగాణ మెదకు మండలాంతర్గతమైన ఆందోలు తాలూక జోగిపేట నగరమున సదాచార సంపన్నులైన వీరశైవ సత్కుటుంబములో శ్రీ వీరయ్యగారు మరియు శ్రీమతి నాగమాంబల పుణ్యగర్భ శుక్తిక యందు వీరు స్వస్తి శ్రీ రుధిరోద్గారి నామ సం॥ 1925మున జన్మించిరి.

సద్బ్రహ్మచారులు నిరతాన్న దాన ప్రవర్తకులు నైన వీరు శ్రీ రాచవీర దేవరకు జ్యేష్ఠ పితృవ్యులు పూజ్య శ్రీ గొల్లాళప్ప (షడక్షరి మహస్వాముల వారు) వీరిని తమ సదాశివపేట మరియు జోగిపేట పెద్దమఠములకుత్తరాధికారిగా స్వీకరించి స్వస్తి శ్రీ రక్తాక్షినామ సం॥ ఫాల్గుణ బహుళ ౧, పాడ్యమి బుధవారమునాడు కారణ సంస్కారములతివైభవముగా జరిపించిరి.

పిదప శ్రీ ని. ప్ర. స్వ. విరుపాక్షానంద మహాస్వాములు న్యాయ వేదాంత సాంఖ్య యోగ మీమాంసాది శాస్త్రపారంగతులు వీరిని సంస్కృతాభ్యాసమునకై మైసూరు ప్రాంతమందలి యాదగిరి, శంకర సంస్కృత కాలేజికి బంపించిరి. అట వీరు సంస్కృతమున కావ్యతీర్థ, కన్నడ జాణ, హిందిభూషణ. వరకధ్యయన మొనర్చి పట్టభద్రులైరి. పిదప ఉస్మానియా యూనవర్సిటీ M. O. L. మరియు సం॥ లో "భాషాప్రవీణ" పరీక్షలో నెగ్గియున్నారు.

కొన్నాళ్ళు ధారవాడ పూజ్యశ్రీ మృత్యుంజయ మహస్వాములవారి దివ్యసేవకావృత్తిలో నుండి వీరశైవ ధార్మికసిద్ధాంతములను సాహిత్య

సంస్కృతుల నలవరచు కొనిరి. పిదప తమ జన్మభూమికి దిరిగివచ్చి శ్రీ గురువుగారి మరియు తల్లిదండ్రుల యాజ్ఞానుసారముగా గృహస్థాశ్రమమును స్వీకరించిరి.

కుటుంబపోషణకై ప్రభుత్వోపాధ్యాయ వృత్తి నవలంభించియున్నారు; అవకాశమును బురస్కరించుకొని వీరశైవ సమాజమునకుడుతా భక్తి సేవ జేయుచున్నారు. హై, సికింద్రబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు ప్రధానకార్యదర్శిగా తరువాత అధ్యకులుగాను ఉండి సాహిత్యసేవ యొనర్చియున్నారు.

వీరు స్వభావముచేత నిరాడంబరజీవులు: సరలదయార్ద్ర హృదయులు సదాచార సచ్ఛీల సద్గుణసంపన్నులు. వీరశైవ సమాజమునకు హహిత్య; సాంఘిక, వైజ్ఞానిక. ధార్మికముల ననుసరించి యెల్లపుడు వీరు సేవ జేసి యున్నారు. చేయుచున్నారు గూడ.

7-3-1959 లో శివానుభవగోష్ఠిని ప్రారంభించి నడిపియున్నారు.

18-4-1960 హైదరాబాదునగర వీరశైవ తరుణ సంఘాధ్యకులుగను:

12-8-1963 హై. నగర వీరశైవ సమాజమునకు ఉపాధ్యకులుగను.

1-12-1965 ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల విద్యార్థి సాహిత్య సమితి, హైద్రాబాద్‌కు అధ్యకులుగను.

6-8-1967 హైదరాబాదు, సికింద్రబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు ప్రధాన కార్యదర్శిగను.

11-3-1970 నగర వీరశైవ సమాజమునకు ప్రధాన కార్యదర్శిగను: